# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

## జిల్లా ప్రణాళిక

## 1957-58

# శ్రీకాకుళం జిల్లా

ప్రణాళిక, అభివృద్ధి శాఖ

ఆంధ్రప్రదేశ్

# సాధారణ విషయాలు

## వైశాల్యము : విభాగములు ;

ఈ జిల్లా వైశాల్యం 3899 చదరపుమైళ్లు. దీనిలో 2 రెవిన్యూ డివిజన్లూ 11తాలూకాలూ ఉన్నాయి. 1954-55 వ సంవత్సరపు వైశాల్యం, విభాగాలు ఈ క్రింద ఇవ్వబడినవి :

| | వైశాల్యం ఎకరాల్లో | మొత్తం వైశాల్యంలో శాతం |
|---|---|---|
| మొత్తపు వైశాల్యం | 24,91,076 | — |
| అడవుల వైశాల్యం | 4,33,968 | 17.4 |
| సేద్యానికి పనికిరాని ఖయాళీభూములు | 4,52,892 | 18.2 |
| వ్యవసాయేతర ప్రయోజనాలకుపయోగింపబడే నేల | 69,490 | 2.8 |
| సేద్యానికిఅనువై వృధాగానున్న నేల | 2,15,869 | 8.7 |
| శాశ్వత పచ్చికబయళ్లు, పశువులమేతకుపయోగింపబడే భూములు | 93,796 | 3.8 |
| చిల్లరరకాల వృక్షాలు, పంటలు, తోపుల క్రిందనున్న భూమి: (సేద్యంకాబడే నికరపు భూమిలో చూపబడ లేదు) | 23,516 | 0.9 |
| ప్రస్తుతపు బీళ్లు | 2,26,362 | 9.1 |
| తదితర బీళ్లు | 1,02,161 | 4.1 |
| సాగుచేయబడుతున్న నికరపు ప్రాంతం | 8,73,022 | 35.0 |
| ఒకసారికంటె అధికంగా సాగుచేయబడే ప్రాంతం | 2,86,064 | 11.5 |
| మొత్తం సాగుచేయబడుతున్న ప్రాంతం | 11,59,086 | 46.5 |

## వర్ష పాతము: వర్షపురోజులు (1954-55)

| | సరాసరి వర్ష పాతం | సరాసరి వర్షపు రోజులు |
|---|---|---|
| (1) | (2) | (3) |
| నైఋతి ఋతుపవనాలు | 22.5 | 24 |
| ఈశాన్య ఋతుపవనాలు | 12.7 | 8 |
| శీతాకాలం | — | — |
| వేసవికాలం | 9.6 | 11 |
| | 44.8 | 43 |

## నీటివసతులు : సాగునీరు.

ఈ జిల్లాలో సాగునీరు ప్రధానంగా, నాగావళి, వంశధార, బహుదానదులద్వారా లభిస్తుంది. పార్వతీపురం తాలూకాలో ఉన్న తోటపల్లి వద్ద నాగావళి నదికి ఆనకట్ట కట్టబడ్డది. ఈ ఆనకట్టనుంచే పంట కాలువలు వెలువడుతాయి. నాగావళి ఉపనది చంద్రముఖి. దీని నీటితో పాలకొండ శ్రీకాకుళం తాలూకాలలోని చాలాభాగాలు, పార్వతీపురం తాలూకాకు చెందిన కొద్దిభాగాలు సేద్యం చేయబడుతున్నాయి. వంశధారనది పాతపట్నం, శ్రీకాకుళం తాలూకాలకు సాగునీటిని సరఫరా చేస్తోంది. బహుదానది ఇచ్ఛాపురం తాలూకాకు చెందిన భూములకు నీటి వసరు కలిగిస్తోంది.

1954-55 వ సంవత్సరపు నీటివసర్లు, వాటిక్రింద సాగయ్యే భూముల వివరాలు, ఈ క్రింద ఇవ్వబడ్డాయి :

## నీటి వసతులు.

| | | |
|---|---|---|
| 1. | ప్రభుత్వకాలువలు | 79 |
| 2. | ప్రైవేట్ కాలువలు | 17 |

| | |
|---|---|
| 3. సేద్యానికే ఉపయోగింపబడే బావులు | |
| (i) రాతివి | 4,650 |
| (ii) ఇతరమైనవి | 4,052 |
| 4. గృహోపయోగాలకే ఉపయోగించబడే బావులు | 10,850 |
| 5. ఉపయోగంలో లేని బావులు | 40 |
| 6. చెరువులు | — |
| (1) 100 ఎకరాలకు పైన అయకట్టులు కలవి | 1,992 |
| (2) 100 ఎకరాలకంటె తక్కువ ఆయకట్టులు కలవి | 7,324 |

## సాగయ్యే భూమి.

| వసతి | ఎకరాలు |
|---|---|
| 1. ప్రభుత్వకాలువలు | 1,00,560 |
| 2. ప్రైవేట్ కాలువలు | 20,001 |
| 3, చెరువులు | 2,50,450 |
| 4. బావులు | — |
| (ఎ) సేద్యానికే ఉపయోగించ బడేవి | 15,450 |
| (బి) ఇతరవసతులను వృద్ధిపరచేవి | 10,132 |
| 5. ఇతర వసతులు (ఊటకాలువలు మొదలైనవి) | 15,075 |
| 6. సేద్యం కాబడుతున్న మొత్తం నికరపుభూమి | 4,01,536 |
| 7. విత్తనాలు జల్లిన మొత్తం భూమిలో నీటిపారుదల పొందుతున్న నికరా ప్రదేశం: శాతం | 45.9 |
| 8. ఒకసారికంటె ఎక్కువసార్లు సాగయ్యే ప్రాంతం | 1,37,020 |
| 9. నీటి పారుదల పొందే ప్రాంతపు మొత్తం వైశాల్యం | 5,38,556 |

| | |
|---|---|
| 10. విత్తనాలు జల్లిన మొత్తం ప్రాంతంలో నీటి పారుదల పొందే మొత్తపు ప్రాంతం : శాతం | — 46.5 |
| 11. ముఖ్యమైన నీటి పారుదల వసతులను వృద్ధిపరుస్తున్న బావులు | 2,770 |
| 12. మొత్తం సాగయ్యే ప్రాంతంలో స్వంత ఆయకట్టు కల్గిఉన్న బావులవల్ల సాగయ్యే ప్రాంతం శాతం | — 3.8 |

పంటలు :

వరి, చోళ్లు, గంటి, మొక్కజొన్న, రాగి, కొఱ్ఱ, వరుగు, సాములు ఈ జిల్లాలో ఉన్న ముఖ్యపు పంటలు. చెరుకు, నార ఈ జిల్లాయందలి ముఖ్యమైన వాణిజ్యపు పంటలు. ఇవిగాక, వేరుశెనగ, నువ్వులు, పొగాకు కూడా ఈ జిల్లాలో పండించబడుతున్నాయి. సముద్రతీర ప్రాంతపు తాలూకాలయిన ఇచ్ఛాపురం, సోంపేటలు కొబ్బరికి ప్రసిద్ధిగాంచివున్నాయి. పనస, జీడిమామిడి తోటలుకూడా ఈ జిల్లాలో బాగానే ఉన్నాయి. 1954-55వ సంవత్సరంలో ఈ జిల్లాయందలి పంటలు, వాటి వివరాలు ఈ క్రింద ఇవ్వబడినవి :

## ఆహారపు పంటలు

### I. కాయధాన్యాలు :

| | | ప్రాంతం ఎకరాల్లో | మొత్తం పంట |
|---|---|---|---|
| 1. | వరి | 5,33,112 | 2,39,430 (బియ్యం) |
| 2. | గోధుమ | — | — |
| 3. | చోళ్లు | 12,635 | 3,570 |
| 4. | గంటి | 25,538 | 6,800 |
| 5. | మొక్కజొన్న | 614 | 230 |
| 6. | రాగి | 98,903 | 39,970 |
| 7. | కొఱ్ఱ | 1,145 | 290 |

| | | | |
|---|---|---|---|
| 8. | వరుగులు | 9,302 | 2,760 |
| 9. | సాములు | 9,565 | 1,920 |
| 10. | ఊదలు | 23,539 | — |
| 11. | ఇతర కాయధాన్యాలు | 8,696 | 6,830 |
| | | 7,23,049 | 3,01,800 |

II. పప్పుధాన్యాలు :

| | | | |
|---|---|---|---|
| 1. | శెనగలు | 53 | 10 |
| 2. | పెసలు | 78,980 | 7,020 |
| 3. | కందులు | 4,904 | 730 |
| 4. | మినుములు | 14,754 | 1,340 |
| 5. | ఉలవలు | 41,672 | 3,160 |
| 6. | ఇతరములు | 16,935 | 1,030 |
| | మొత్తం | 1,57,298 | 13,290 |

III. మసాలా దినుసులు, సుగంధద్రవ్యాలు :

| | | | |
|---|---|---|---|
| 1. | మిర్చి | 7,514 | 6,040 |
| 2. | పోకచెక్కలు | 1 | — |
| 3. | అల్లం | 50 | — |
| 4. | పసుపు | 1,652 | — |
| 5. | వెల్లుల్లి | 2,386 | — |
| 6. | ధనియాలు | 95 | — |

| | | | |
|---|---|---|---|
| 7. | చింతపండు | 4,819 | — |
| 8. | తదితర మసాలాదినుసులు, సుగంధద్రవ్యాలు | 1,562 | — |
| | మొత్తంమసాలాదినుసులు, సుగంధద్రవ్యాలు | 18,079 | — |

IV. చక్కెరపంటలు :

| | | | |
|---|---|---|---|
| 1. | చెరుకు | 19,555 | 45,770 |
| 2. | తాడి | 1,852 | — |
| 3. | తదితరపు పంటలు | 2,362 | — |
| | మొత్తం చక్కెరపంటలు | 23,769 | — |

V. పళ్లు, కాయగూరలు :

| | | | |
|---|---|---|---|
| 1. | అరటి | 4,246 | — |
| 2. | నిమ్మజాతిఫలాలు | 1,533 | — |
| 3. | మామిడి | 22,081 | — |
| 4. | ఇతర తాజాఫలాలు | 633 | — |
| | మొత్తం | 28,493 | — |
| 5. | జీడిమామిడిగింజలు | 3,539 | — |
| 6. | ఇతర ఎండుఫలాలు | | — |
| | మొత్తం తాజా, ఎండుఫలాలు | 32,032 | — |

| | | | |
|---|---|---|---|
| 7. | క్రపెండలం | 1,314 | — |
| 8. | బంగాళాదుంపలు | 26 | 80 |
| 9. | ఎర్రదుంపలు | 216 | — |
| 10. | నీరుల్లి | 1,796 | 9,140 |
| 11. | ఇతర కాయగూరలు | 854 | — |
| | మొత్తం కాయగూరలు | 4,206 | — |
| | మొత్తం పళ్లు, దుంపలతో సహా కాయగూరలు | 36,238 | — |
| VI | ఇతర చిల్లర ఆహారపు పంటలు : | | 1,753 |
| | మొత్తం ఆహారపు పంటలు | | 9,60,186 |

## ఆహారేతర పంటలు

I. నార :

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రత్తి | 1,101 | 130 (బేళ్లు) |
| 2. | బొంబాయి జనుము | 59,980 | 1,42,450 (బేళ్లు) |
| 3. | జనుము | 1,711 | — |
| 4. | తదితర నారపంటలు | | — |
| | మొత్తం నారపంటలు | 62,792 | — |

II. నూనెగింజలు :

| | | | |
|---|---|---|---|
| 1. | వేరుశెనగ | 81,437 | 34,610 |
| 2. | కొబ్బరి | 10,465 | — |

| | | | |
|---|---|---|---|
| 3. | నువ్వులు | 27,021 | 3,650 |
| 4. | ఆవాలు | 120 | — |
| 5. | ఇతర ఆహార గింజలు . | 10 | — |
| 6. | ఆముదపు గింజలు | 753 | 80 |
| 7. | నల్లనువ్వులు | 8,645 | — |
| 8. | ఇతర గింజలు | 13 | — |
| | మొత్తం నూనెగింజలు | 1,28,464 | — |

III. మందులు : మత్తు పదార్థములు :

| | | | |
|---|---|---|---|
| 1. | కాఫీ | 1 | — |
| 2. | | 2 | — |
| 3. | తమలపాకులు | 424 | — |
| 4. | పొగాకు | 4,577 | 1,920 |
| 5. | తదితరాలు | 1 | — |
| | మొత్తం మందులు, మత్తుపదార్థాలు | 5,005 | — |

IV. రంగులు, తోళ్ల పరికరాలు :

| | | | |
|---|---|---|---|
| 1. | నీలిమందు (రంగులు వేయడానికి మాత్రం ఉపయోగించబడేది) | 28 | 10 (హండ్రడ్ వెయిట్) |
| 2. | ఇతర రంగులు | 1 | — |
| | మొత్తం రంగులు | 29 | — |

| | | |
|---|---|---|
| V. గడ్డి పంటలు : | 47 | — |
| VI. పచ్చిఎరువు పంటలు : | | |
| 1. జనుము | 348 | — |
| 2. నీలిమందు | 600 | — |
| 3. పిల్లిపెసర | 57 | — |
| 4. | 59 | — |
| 5. ఇతర పచ్చిఎరువు పంటలు | 13 | — |
| మొత్తం పచ్చిఎరువు పంటలు | 1,077 | — |
| VII. ఆహారేతర చిల్లర పంటలు | 1,486 | — |
| మొత్తం ఆహారేతర పంటలు | 1,98,900 | — |
| మొత్తం సాగుచేయబడ్డ భూమి | 11,59,086 | — |
| ఒకసారికంటె ఎక్కువసార్లు సాగుచేయబడ్డ భూములు | 2,86,064 | — |
| సాగుచేయబడే నికరం భూమి | 8,73,022 | — |

## స్థానిక పరిపాలన.

ఈ జిల్లాలో, శ్రీకాకుళం, సాలూరు, బొబ్బిలిలో మూడు పురపాలక సంఘాలు ఉన్నాయి. ఇవికాక 1956-57 సంవత్సరంలో 13, ఒకటవ తరగతి, 554 రెండవ తరగతి పంచాయతీబోర్డులుకూడా ఉన్నవి.

## తపాలా కార్యాలయాలు.

ఈ జిల్లాలో, 1954-55వ సంవత్సరంలో, 268 బ్రాంచి తపాలా కార్యాలయాలు, 5 సబ్ తపాలా కార్యాలయాలు, 25 టెలిగ్రాఫ్ సబ్ పోస్టాఫీసులు ఉన్నాయి.

## రోడ్లు.

ఈ జిల్లాలో ఉన్నరోడ్లు, విశాఖపట్నానికి, ఒరిస్సా రాష్ట్రానికి పోతాయి. 1954-55వ సంవత్సరంలో ఈ జిల్లాలో 964 మైళ్ల రోడ్లు ఉన్నాయి. వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| | | మైళ్లు |
|---|---|---|
| 1, ప్రభుత్వరోడ్లు | | |
| (అ) దేశపు రహదారులు | | 134 |
| (ఆ) రాష్ట్ర రహదారులు | | 38 |
| (ఇ) పెద్ద జిల్లా రోడ్లు | | 349 |
| (ఈ) ఇతరరోడ్లు | | 2 |
| | మొత్తం | 523 |
| 2. జిల్లాబోర్డు రోడ్లు | | |
| (అ) పెద్ద జిల్లా రోడ్లు | | 102 |
| (ఆ) ఇతర జిల్లా రోడ్లు | | 137 |
| (ఇ) గ్రామపు రోడ్లు | | 154 |
| | మొత్తం | 393 |
| 3, పి. డబ్లు. డి. రోడ్లు | | — |
| 4. పురపాలక సంఘపు రోడ్లు | | 48 |

## రైలు మార్గాలు.

ఈ జిల్లాలో తూర్పురైల్వేకు చెందిన, 147 మైళ్ల బ్రాడ్ గేజ్, 21 మైళ్ళ నేరోగేజ్ రైలుమార్గాలు ఉన్నాయి. మద్రాసునుండి కలకత్తాపోయే రైలుమార్గం, చీపురుపల్లి, శ్రీకాకుళం, నరసన్నపేట, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాల మీదుగా పోతుంది. ఒక మీటర్ గేజ్ రైలుమార్గం టెక్కలి తాలూకాలోని నౌపడ

నుంచి బయలుదేరి, పాతపట్నం మీదుగా ఒరిస్సారాష్ట్రంలోని పర్లాకిమిడి, గునుపూరులకు పోతుంది. విజయనగరంనుంచి రాయపూరు పోయే బ్రాడ్‌గేజ్‌మార్గం, సాలూరు బొబ్బిలి, పార్వతీపురం తాలూకాలమీదుగా పోతుంది. బొబ్బిలినుంచి సాలూరు వరకు బ్రాడ్‌గేజ్ రైలుమార్గం ఉంది. పాలకొండ, నరసన్నపేట తాలూకాల ముఖ్యనగరాలకు మాత్రం ఎట్టి రైలుమార్గాలు లేవు.



## సహకారసంఘాలు.

1955-56వ సంవత్సరంలో, ఈ జిల్లాలో, 17,952 మంది మెంబర్లతో 95 వ్యవసాయేతర సహకార సంఘాలు, 67,530 మంది మెంబర్లతో, 733 వ్యవసాయ సహకార సంఘాలు ఉన్నాయి.



## విద్య.

1954-55వ సంవత్సరానికి చెందిన, ఈ జిల్లా విద్యాసంస్థల వివరాలు ఈదిగువ ఇవ్వబడ్డాయి.

1. ప్రాథమిక పాఠశాలలు.

| | | | |
|---|---|---|---|
| (అ) ప్రభుత్వం | 17 | 4 | 21 |
| (ఆ) జిల్లాబోర్డు | — | 650 | 650 |
| (ఇ) పురపాలక సంఘాలు | — | 11 | 11 |
| (ఈ) ప్రైవేట్ (ఎయిడెడ్) | 49 | 1366 | 1415 |
| మొత్తం | 66 | 2031 | 2097 |

2. (i) ప్రభుత్వ సహాయం పొందుతూ, ఉపాధ్యాయుల అధీనంలోనున్న ప్రాథమిక పాఠశాలలు

| | | | |
|---|---|---|---|
| (అ) హైయర్ ప్రాథమిక | — | 7 | 7 |
| (అ) లోయర్ ప్రాథమిక (ఒక ఉపాధ్యాయుడుండే వాటికన్న వేరైనవి) | 49 | 1197 | 1246 |
| (ఇ) లోయర్ ప్రాథమిక (ఒక ఉపాధ్యాయుడుండేవి) | — | 11 | 11 |
| మొత్తం | 49 | 1215 | 1264 |

(ii) ప్రభుత్వ సహాయం పొందుతూ, ఉపాధ్యాయుల అధీనంలో ఉన్న బేసిక్ స్కూళ్లు:

| | | | |
|---|---|---|---|
| జూనియర్ బేసిక్: (ఒక ఉపాధ్యాయుడుండే వాటికన్న వేరైనవి) | — | 11 | 11 |

3. బేసిక్ స్కూళ్లు

| | | | |
|---|---|---|---|
| (అ) ప్రభుత్వం | 1 | 2 | 3 |
| (ఆ) జిల్లాబోర్డు | — | 10 | 10 |
| (ఇ) పురపాలక సంఘాలు | — | — | — |
| (ఈ) ప్రైవేట్ (ఎయిడెడ్) | — | 17 | 17 |
| మొత్తం | 1 | 29 | 30 |

4. (i) బాలుర సెకండరీ పాఠశాలలు: మొత్తం

| | | |
|---|---|---|
| (అ) ప్రభుత్వం | | |
| (ఆ) జిల్లాబోర్డు | 40 | — |
| (ఇ) పురపాలక సంఘం | 1 | — |
| (ఈ) ప్రైవేట్ (ఎయిడెడ్) | 1 | — |
| మొత్తం: | 42 | — |

5. (ii) బాలికల సెకండరీ పాఠశాలలు:

| | | |
|---|---|---|
| (అ) ప్రభుత్వం | 1 | — |

6. పురుషుల కళాశాలలు:

| | | |
|---|---|---|
| ప్రభుత్వం | 1 | — |

7. (i) పురుషుల శిక్షణా పాఠశాలలు:

| | | |
|---|---|---|
| (అ) ప్రభుత్వం | 1 | — |

| | | | |
|---|---|---|---|
| (ii) స్త్రీల శిక్షణా పాఠశాలలు: | | — | — |
| (iii) పురుషుల బేసిక్ శిక్షణాపాఠశాలలు: | | | |
| ప్రభుత్వం | | 2 | — |
| (iv) స్త్రీల బేసిక్ శిక్షణా పాఠశాలలు: | | — | — |

7. పరిశ్రమల పాఠశాలలు:

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వం | | 1 | — |

8, వాణిజ్య పాఠశాలలు:

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వామోదం పొందినవి | | 3 | — |

9. వయోవృద్ధుల పాఠశాలలు:

| | ఏజెన్సీ | మైదానం | మొత్తం |
|---|---|---|---|
| ప్రభుత్వం | | 4 | 4 |
| జిల్లాబోర్డు | | 16 | 16 |
| పురపాలక సంఘం | | 3 | 3 |
| ప్రైవేట్ (ఎయిడెడ్) | 10 | 137 | 147 |
| మొత్తం | 10 | 160 | 170 |

10. షెడ్యూల్డు జాతుల ప్రాథమిక పాఠశాలలు:

| | | | |
|---|---|---|---|
| (అ) ప్రభుత్వం | 17 | 1 | 18 |
| (ఆ) జిల్లాబోర్డు | | 4 | 4 |
| (ఇ) ప్రైవేట్ (ఎయిడెడ్) | 49 | 9 | 58 |
| మొత్తం | 66 | 14 | 80 |

11. షెడ్యూల్డు కులాల ప్రాథమిక పాఠశాలలు:

| | | |
|---|---|---|
| (అ) ప్రభుత్వం | 1 | 1 |
| (ఆ) జిల్లాబోర్డు | 3 | 3 |
| (ఇ) ప్రైవేట్ (ఎయిడెడ్) | 19 | 19 |
| మొత్తం | 23 | 23 |

## వైద్యం

1954 లో జిల్లాలో ఉన్న వైద్యసంస్థలు - ప్రభుత్వ ఆసుపత్రులు 4; ప్రభుత్వ డిస్పెన్సరీలు 4, లోకల్‌ఫండ్ ఆసుపత్రులు 6, మ్యునిసిపల్ ఆసుపత్రి 1, లోకల్ ఫండ్ డిస్పెన్సరీలు 14, కుష్ఠుచికిత్సాలయం 1.

# రాష్ట్ర ద్వితీయ ప్రణాళికయొక్క రెండవ సంవత్సర సంక్షిప్త కార్యక్రమం

1957 జనవరిలో ప్లానింగ్ కమిషన్ ఉద్యోగులతో, కేంద్ర ప్రభుత్వాధికార్లతో సంప్రదింపులు జరిపాక, రెండవ ప్రణాళిక రెండవ సంవత్సరంలో రూ. 34 కోట్ల మొత్తం వినియోగింపబడాలని నిశ్చయించటమైనది. కేంద్ర సహాయం లభించే స్కీములు విషయంలో కేంద్రప్రభుత్వం కొన్ని మార్పులను సూచించింది. ఇందు మూలంగా ప్రతి స్కీము కేటాయింపులోనూ కొంత మార్పు చేయవలసి వచ్చింది. ప్రతి అభివృద్ధి కార్యక్రమపు పద్దుకింద చేసిన కేటాయింపులు ఒకటవ పట్టికలో పేర్కొన బడినవి.

1957-58 కేటాయింపుల్లో చాలా భాగం నీటి పారుదల, విద్యుచ్ఛక్తి స్కీముల కిందకు వస్తుంది. మొత్తం కేటాయింపుల్లో వీటి కింది కేటాయింపులు 100కి 40 పాళ్లు ఉన్నవి. వ్యవసాయ కార్యక్రమాల కేటాయింపు 21 శాతం, సాంఘిక సౌకర్యాల కేటాయింపు 19 శాతం, పరిశ్రమల కేటాయింపు 7 శాతం, రవాణా కేటాయింపు 3 శాతం మాత్రమే.

మొత్తం కేటాయింపులో ప్రతి అభివృద్ధి కార్యక్రమంపద్దు కేటాయింపు శాతం ఎంత వుందో ఒకటవ పట్టీలో చూడవచ్చును.

1956_57 సంవత్సరానికని మొదట్లో సూచించిన వినియోగంతో పోలిస్తే, ఈ సంవత్సరం వినియోగం రూ. 421.666 లక్షలు పెరిగింది. అయితే ఇది సహజమే. ఎందుకంటే, ప్రాజెక్టులు నిర్వహణకు సంబంధించిన ఏర్పాట్లు వృద్ధి చెందుతున్నకొద్దీ వినియోగంకూడా హెచ్చుతుంది. 1956-57, 1957-58 కేటాయింపులను రెండవ పట్టీలో చూడవచ్చును. ఏ అంశాలకు ప్రాధాన్యం చూపాలి అనే విషయమై ఈ రెండేళ్ళ కార్యక్రమాల్లోనూ ఒకే దృక్పథాన్ని అనుసరించినా, వ్యవసాయం, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి మినాహా మిగతా అన్ని పద్దుల కింద కేటాయింపులు అధికం చేయబడినాయి.

# ఒకటవ పట్టీ

## 1957-58 ప్రణాళికా వినియోగం

| వ. సం. | అభివృద్ధి కార్యక్రమం | 1957-58లో కేటాయింపు రు. లక్షలు ఆంధ్ర | తెలంగాణ | ఆంధ్ర ప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకుశాతం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| I. | వ్యవసాయ కార్యక్రమాలు | 460 580 | 238.560 | 699.140 | 20.57 |
| 1. | వ్యవసాయ ఉత్పత్తి | 101.460 | 43.840 | 145.300 | 4.27 |
| 2. | మైనర్ ఇరిగేషన్ | 31.190 | 34.930 | 66.120 | 1.95 |
| 3. | భూమి అభివృద్ధి | 9.490 | 5.000 | 14.490 | 0 43 |
| 4. | పశుపోషణ | 28.370 | 18.420 | 46.790 | 1.38 |
| 5. | పాడిపరిశ్రమ, పాలసప్లయి | 6.080 | 2,540 | 8.620 | 0.25 |
| 6. | అడవులు | 10.640 | 6.730 | 17.370 | 0.51 |
| 7. | భూసార సంరక్షణ | 16.470 | 5.340 | 21.810 | 0.64 |
| 8. | మత్స్య పరిశ్రమ | 8.310 | 7.360 | 15.670 | 0.46 |
| 9. | సహకారసంఘాలు | 18.770 | 15.080 | 33.850 | 1.00 |
| 10. | గిడ్డంగులు, మార్కెటింగ్ | 36.550 | 2.420 | 38.970 | 1.15 |
| 11. | ఇతరములు | 0.250 | 0.540 | 0.790 | 0.02 |
| 12. | జాతీయ విస్తరణ సేవా బ్లాకులు, కమ్యూనిటీ ప్రాజెక్టులు | 193.000 | 96.360 | 289.360 | 8.52 |
| II. | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 1129.295 | 448.100 | 1577.390 | 46 40 |
| 13. | సకలార్థ సాధక ప్రాజెక్టులు | 350.000 | 200.000 | 550.000 | 16.18 |
| 14. | నీటిపారుదల | 266.020 | 75.050 | 341.070 | 10.03 |
| 15. | విద్యుచ్ఛక్తి | 513.270 | 173.050 | 686.320 | 20.19 |
| III. | పరిశ్రమలు | 177.860 | 78.010 | 250.870 | 7.38 |
| 16. | పెద్ద, మధ్యరకం పరిశ్రమలు | 45.060 | — | 45.060 | 1.33 |
| 17. | పల్లెపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు | 132.800 | 73.010 | 205.870 | 6 05 |

| | | | | |
|---|---|---|---|---|
| IV. రవాణా | 79.210 | 39.620 | 118.830 | 3.49 |
| 18. రోడ్డు రవాణా | 79.210 | 39.620 | 118.830 | 3.49 |
| V. సాంఘిక సౌకర్యాలు | 384.397 | 263.651 | 643.048 | 19.07 |
| 19. విద్య | 119.364 | 94.791 | 214.155 | 6.30 |
| 20. వైద్యం | 66.490 | 47.350 | 113.840 | 3.35 |
| 21. ప్రజారోగ్యం | 86.360 | 33.340 | 119.700 | 3.52 |
| 22. గృహవసతి | 38.890 | 69.370 | 108.250 | 3.18 |
| 23. కార్మికులు, కార్మికసంక్షేమం | 4.850 | 7.530 | 12.380 | 0.36 |
| 24. వెనుకబడ్డ వర్గాల షెడ్యూల్డు కులాల శ్రేయస్సు | 21.260 | 6.280 | 27.540 | 0.81 |
| 25. షెడ్యూల్డుజాతుల శ్రేయస్సు | 36.723 | 3.140 | 39.863 | 1.17 |
| 26. స్త్రీ సంక్షేమం | 4.460 | — | 4.460 | 0.13 |
| 27. సాంఘిక సంక్షేమం | 6.000 | 1.850 | 7.850 | 0.23 |
| VI. ఇతరములు | 101.504 | 3.774 | 105.278 | 3.09 |
| 28. రాజధాని అభివృద్ధి | 85.500 | — | 85.500 | 2.52 |
| 29. మ్యునిసిపల్ రోడ్లు అభివృద్ధి పనులు | 9.560 | — | 9.560 | 0.28 |
| 30. రేడియో ప్రసారం | 2.460 | 0.990 | 3.450 | 0.10 |
| 31. ప్రచారం | 2.134 | 1.764 | 3.898 | 0.11 |
| 32. ఎకనామిక్స్ స్టాటిస్టిక్స్ బ్యూరో | 1.850 | 1.020 | 2.870 | 0.08 |
| మొత్తం | 2333.861 | 1065.695 | 3399.556 | 100.00 |

రెండవ పట్టీ

| వరుస సంఖ్య | అభివృద్ధికార్య క్రమంపద్దు | 1956-57 లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణ | ఆంధ్రప్రదేశ్ (రూ. లక్షలు) | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం | 1957-58లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణ | ఆంధ్రప్రదేశ్ (రూ. లక్షలు) | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వ్యవసాయ కార్యక్రమాలు | 329 790 | 325.070 | 654.860 | 21.99 | 460.580 | 238.560 | 699.140 | 20.57 |
| 2. | నీటి పారుదల, విద్యుచ్ఛక్తి | 1143.420 | 498.760 | 1642.180 | 55.15 | 1129.290 | 448.100 | 1577.390 | 46.40 |
| 3. | పరిశ్రమలు | 107.480 | 55.260 | 162.740 | 5.46 | 177.860 | 73.010 | 250.860 | 7.38 |
| 4. | రవాణా | 60.330 | 22.500 | 82.830 | 2.78 | 79.210 | 39.620 | 118.830 | 3.49 |
| 5. | సాంఘిక సౌకర్యాలు | 227.960 | 134.330 | 362.290 | 12.17 | 384.397 | 263.651 | 648.048 | 19.07 |
| 6. | ఇతరములు | 70.770 | 2.220 | 72.990 | 2 45 | 101.504 | 3.774 | 105.278 | 3.09 |
| | మొత్తం | 1939.750 | 1038.140 | 2977.890 | 100.00 | 2332.841 | 1066.715 | 3399.556 | 100.00 |

# వ్యవసాయ ఉత్పత్తి

## సమగ్రసిబ్బంది స్కీము

సాధ్యమైనంతగా వ్యవసాయోత్పత్తిని అధికం చేయాలనే ఉద్దేశ్యంతో వ్యవసాయానికి సంబంధించిన కార్యక్రమాలు చాలా రెండవ ప్రణాళికలో చేర్చబడినాయి. ఈ వివిధ కార్యక్రమాల నన్నిటిని అమలు జరపటానికి, రాష్ట్ర ప్రధాన కార్యాలయంలోనే కాక, జిల్లా స్థాయిలోకూడా అదనపు సిబ్బంది కావాలి. అజమాయిషీ (సాంకేతిక) చేసేవారు కావాలి. మిగతా సిబ్బందీ కావాలి. ఇతర సిబ్బందితో సహా ఒక జిల్లా వ్యవసాయాధికారిని ఈ జిల్లాలో ఈ ఏడాది నియమించాలని సూచన చేయడమైనది. లెక్కలు అభివృద్ధినివేదికల తయారీ వగైరాలకు అదనంగా ఉత్తర ప్రత్యుత్తరాలు అజమాయిషీ వగైరా పనులుకూడా ఈ సిబ్బంది చేస్తారు.

## మేలురకం విత్తనాల అభివృద్ధి, పంపిణీ

రెండవ ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయటానికి గాను, కేంద్ర ప్రభుత్వ వ్యవసాయశాఖ, ప్రణాళికాసమితి దేశంలోని ప్రతి సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ బ్లాకులో ఒక విత్తనాల క్షేత్రాన్ని. విత్తనాల కొట్టును ఏర్పాటు చేసే స్కీము నొకదానిని రాష్ట్ర ప్రభుత్వాలకు సిఫార్సు చేసినవి. విత్తనాల క్షేత్రం సగటున 25 ఎకరాలు ఉంటుంది. ఇందులో 5-10 ఎకరాలు మెట్టప్రాంతంగానూ, మిగతాది మాగాణిగానూ ఉంటుంది. వరి, మిల్లెట్లు, పప్పుధాన్యాలు లాంటి ఆహారపు పంటలు పచ్చి ఎరువులాంటి మిగతా పంటలు వీటికి మాత్రమే ఈ స్కీములో అవకాశం ఉంటుంది. చెఱకు, నూనె విత్తులు, పత్తి, పొగాకులాంటి వ్యాపారపు పంటలు ఈ స్కీముకిందకురావు. వాటికి విడిగా స్కీములున్నవి.

ఈ స్కీములో ఒక ముఖ్యాంశం క్రమంగా సెకండరీ విత్తనాలక్షేత్రాలు రద్దు అయిపోతవి. ఎందుకంటె, రైతులపొలాల్లో పెరిగే విత్తనంకన్న ప్రభుత్వ క్షేత్రాల్లో పెరిగే విత్తనమే రైతులకు నచ్చుతుంది. వ్యవసాయ పరిశోధన కేంద్రాల్లో పెరిగే మూల విత్తనం అభివృద్ధి బ్లాకుల్లోని 25 ఎకరాల విత్తనాల క్షేత్రాలకు సప్లయి చేయబడుతుంది. ప్రైమరీ విత్తన క్షేత్రాలకు గాను నిర్ణీత ఉత్పత్తిదార్లకు

రెండవ సంవత్సరంలో పంపిణీ చేసేందుకై విస్తారంగా కీలక విత్తనాలను తయారు చేసేందుకు ఈ విత్తన క్షేత్రాలు బాగా ఉపయోగపడుతవి. ఈ నిర్ణీత ఉత్పత్తిదార్లు వ్యవసాయశాఖ అజమాయిషీ కింద తమ పొలాల్లో మేలురకం విత్తనాలను పండిస్తారు. వీరు పండించే విత్తనంలో సుమారు సగం విత్తనాన్ని రైతులకు సరఫరా చేసేందుకై సేకరించి విత్తనాల కొట్లలో నిల్వచేసి వుంచుతారు. ఈ విధంగా సెకండరీ విత్తనాల క్షేత్రాల అవసరం తీరిపోతుంది. బ్లాకులోని యావత్తు సాగు భూమికి మూడు నాలుగేళ్ళలో మేలురకం విత్తనం లభిస్తుంది. ఈ సంవత్సరం రాష్ట్రంలో 71 విత్తన క్షేత్రాలను 71 విత్తనాల కొట్లను ఏర్పాటుచేయాలని వున్నది. వీటిలో 5 విత్తనక్షేత్రాలు, 5 విత్తనాల కొట్లు ఈ జిల్లాలోని సార్వకోట, ఉర్లాం, ఆముదాలవలస, ఇచ్ఛాపురం, గారబ్లాకుల్లో ఏర్పాటు చేయబడుతాయి. 1957-58లో ఈ జిల్లాలో 798 టన్నుల వరివిత్తనాన్ని, 39 టన్నుల మిల్లెట్లను, 34 టన్నుల పప్పుధాన్య విత్తనాన్ని పంపిణీ చేయాలని ఉద్దేశించబడింది.

## బస్తీల్లో కంపోస్టు తయారీ, పంపిణీలు

ఒకటన్ను కంపోస్టువేస్తే, ఆహార ధాన్యాల ఉత్పత్తి 1/40 టన్ను పెరుగుతుంది. కాబట్టి మ్యునిసిపాలిటీల్లో, మేజరు పంచాయితీల్లో చెత్తాచెదారంతో మల మూత్రాదులతో కంపోస్టు చేసి, ఆ కంపోస్టును అధికోత్పత్తికై పంపిణీ చేయాలి. 1957-58లో ఆంధ్రప్రాంతంలో 11,12,000 టన్నుల కంపోస్టు తయారీ పంపిణీలకై రూ. 3 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకుగాను ఒక కంపోస్టు అభివృద్ధి అధికారి, తగినసిబ్బంది పని చేస్తారు. ఇందులో 4920 టన్నుల కంపోస్టు ఈ జిల్లాలో తయారు చేయబడి, 984 ఎకరాల భూమికి ఉపయోగపడుతుంది. 123 టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా ఉత్పత్తి అవుతాయి.

## కిరాయి - కొనుగోలు పద్ధతిమీద ట్రాక్టర్ల కొనుగోలు పంపిణీ

ట్రాక్టర్ల కిరాయి-కొనుగోలు విధానం రైతులకు నచ్చింది. ఈ పద్ధతి కింద 1957-58లో ఆంధ్రప్రాంతంలో 75 ట్రాక్టర్లను కొనుక్కోగలిగే రైతులకు సప్లయి చేయాలని వున్నది. వీటిలో పది తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంత రైతులకు, ఆరు ఈ జిల్లాలో రైతులకు సప్లయి చేయబడుతాయి. ప్రతి ట్రాక్టరు మూలంగా 400 ఎకరాల భూమి బాగుపడుతుంది. ఈ విధంగా అధికోత్పత్తి ఎకరానికి 1/4 టన్ను ఉంటుంది.

## మేలురకం వ్యవసాయ పనిముట్లు, తేనెపెట్టెలు

ఈ స్కీము ఉద్దేశ్యం మంచిరకం పనిముట్లను, తేనెపెట్టెలను విస్తారంగా సప్లయి చేయాలని. అయిదేసి రూపాయల చొప్పున 18,850 పనిముట్లను, పదేసి రూపాయల చొప్పున 1106 తేనెపెట్టెలను ఆంధ్ర ప్రాంతపు రైతులకు 1957-58లో సప్లయి చేయాలని ఉద్దేశించబడింది. ఈ స్కీము ఖర్చు పూర్తిగా రైతులే భరిస్తారు. ఈ పనిముట్లు, తేనెపెట్టెలు ఈ జిల్లా రైతాంగానికి కూడా సప్లయి చేయబడుతవి.

## పైరుల తెగుళ్ళ జబ్బుల నివారణ

ఈ స్కీము ఉద్దేశ్యం-పైరులకు తగిలే తెగుళ్ళను, జబ్బులను భారీయెత్తున అరికట్టేందుకై వ్యవసాయశాఖ డిమాన్ స్ట్రేటర్లకు తగినన్ని చేతి - స్ప్రేయర్లను డస్టర్లను వ్యవసాయ డిపోలకు పవర్ స్ప్రేయర్లను సప్లయి చేయాలని, ఈ స్కీము కింద ఈ పనిముట్లు రైతులకు కిరాయి పద్ధతిమీద ఇవ్వబడుతవి.

రెండవ ప్రణాళిక మొదటి సంవత్సరం 1956-57 లో 30 పవర్ స్ప్రేయర్లకు 100 చేతి స్ప్రేయర్లకు, 100 చేతి డస్టర్లకు రూ. 9.37 లక్ష మాంజూరు చేయబడింది. కెమికల్స్ కింద రూ. 0.40 లక్ష మంజూరు చేయబడింది. ఇప్పుడున్న శాస్త్రీయ పరికరాలు సరిపోవు. పండ్లు,కూరగాయలు1,చెఱకు, పత్తి, పొగాకు మిర్చి, వేరుశెనగ తదితర వ్యాపారపంటలు అనేక రకాల తెగుళ్ళకు, జబ్బులకు లోనవతవి. పైరురక్షణలో పెద్దలోపం ఏమంటే తగినంతగా స్ప్రేయింగ్ డస్టింగ్ సామాగ్రిలేక పోవటం. మామూలు రైతుస్తోమతుకు మించినవి. ఈ పనిముట్లు. కాబట్టి వ్యవసాయశాఖ వీటిని కొని రైతులకు సప్లయిచేయాలి. ఈ స్కీముకని 1957-58 సంవత్సరానికి రూ. 3.95 లక్షల మొత్తం కేటాయించబడింది. అయితే ఇప్పటి ఆర్థికపరిస్థితిబట్టి, పైనవివరించిన పనిముట్లను మాత్రమే కొనాలని ఉద్దేశించబడింది. కెమికల్స్ ఖరీదు రైతుల నుంచి వసూలు చేయబడుతూంది కాబట్టి, ఈ స్కీముకు 1957-58లో అయ్యే నికర ఖర్చు రూ. 0.87 లక్షమాత్రమే. ఈ స్కీము ఈ జిల్లాకుకూడ వర్తిస్తుంది.

## ఆంధ్ర ప్రాంతంలో చెఱకు అభివృద్ధి

రాష్ట్రిపు నిర్ణీత తాలూకాల్లో గత ఆరేళ్లనుంచి చెఱకుపంట అభివృద్ధి చేయబడుతోంది. ఈ ప్రాంతాల్లో పంట దిగుబడి అధికం అయింది కూడా. కాని నాణ్యాన్ని, దిగుబడిని ఇంకా అధికం చేయటానికి తగిన అవకాశం ఉన్నది. ఇందుకు అభివృద్ధి

పనిని ఇంకా తీవ్రం చేయాలి. ఈ పనికి కొన్ని ముఖ్యమైన తాలూకాల్లో చెఱకు పండించే తాలూకాల్లో పూనుకోవాలని ఉద్దేశించబడింది. వచ్చే 15 సంవత్సరాలలో దిగుబడిని రెట్టింపు చేయటం లక్ష్యం. రెండవ ప్రణాళిక ముగింపు నాటికి ఇప్పటి ఉత్పత్తిని మూడోవంతు అధికం చేయాలని ఉన్నది. 1955-56 దిగుబడికి పదోవంతు అధికోత్పత్తిని పాత అభివృద్ధి ప్రాంతాల్లో సాధించాలని, ఇరవయ్యోవంతు కొత్త అభివృద్ధి ప్రాంతాల్లో సాధించాలని ఉద్దేశించబడింది. వీలైన ప్రదేశాల్లో కొత్త భూముల్లో కూడా చెఱకు వేసి, ఆ విధంగా కూడా ఉత్పత్తి అధికం చేయబడుతుంది. కార్యక్రమం దిగువన ఉదహరించబడింది:—

## ప్రాంతీయ కేంద్రాలకు సాంకేతిక కార్యక్రమం

(i) ముఖ్య పరిశోధన కేంద్రంలో బాగా పనికివస్తయని కనిపెట్టబడిన రకాల గురించి ప్రాంతీయ కేంద్రాల్లోకూడా పరీక్షలు జరుపబడుతవి—రాష్ట్రిపు వివిధ భూముల్లో వాటి ఉపయోగాన్ని తెలుసుకొనేందుకై.

(ii) రైతులకు సప్లయిచేసేందుకు గాను, మేలు రకాల మూల విత్తనం ప్రాంతీయ క్షేత్రాల్లో అధికం చేయబడుతుంది.

(iii) ఏ భూమికి ఎంత ఎరువు కావాలో తెలుసుకొనేందుకై ఎరువు విషయమై కూడా పరిశోధన జరుగుతుంది.

(iv) నిర్ణీతప్రాంతాల్లో సరైన పరిమాణంబట్టి ఎరువుల వాడకం ప్రదర్శించబడుతుంది.

(v) తగ్గింపు ధరలకు తెగుళ్లమందులనిస్తూ, తెగుళ్ల జబ్బుల నివారణ చర్యలు ప్రదర్శించబడుతాయి.

(vi) సాంకేతిక సిబ్బంది శిక్షణ.

## అభివృద్ధి కేంద్రాలకు సాంకేతిక కార్యక్రమం

(i) జబ్బులేని విత్తనాలను అధికంగా పండించి, వాటిని చెఱకు పంటదార్లకు తగ్గింపు ధరలకు సప్లయి చేయటం.

(ii) పంటదార్లకు మంచి విత్తనాన్ని సప్లయి చేయటానికిగాను ఫాక్టరీ 'రిజర్వుడు' ప్రాంతాలో నారుమళ్లను ఏర్పాటు చేయటం.

(iii) ఎరువుల పరిమాణాన్ని సూచిస్తూ ప్రదర్శన ప్రాంతాల నేర్పాటు చేయటం.

(iv) ప్రదర్శన ప్రాంతాల నేర్పాటుచేసి, ప్రాంతీయ కేంద్రాల్లోనూ, 'రిజర్వుడు' ప్రాంతాల్లోనూ పైరురక్షణ చర్యలను ప్రదర్శించటం.

(v) తయారుచేసిన కంపోస్టుకు విరాళమివ్వటంద్వారా కంపోస్టు తయారీని ప్రోత్సాహ పరచటం.

(vi) పంటపోటీలు పెట్టి గెల్చినవారికి బహుమానాలు ఇవ్వటం.

ఆంధ్రప్రాంతంలో ఈ కార్యక్రమాన్ని అమలు జరపటానికై రూ. 2.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ స్కీము ఈ జిల్లాకు కూడా వర్తిస్తుంది.

## వ్యవసాయ పరిశోధనలు

రెండవ ప్రణాళిక ముగింపునాటికి నీటిపారుదల ప్రాజెక్టులు పూర్తి అవుతవి. అప్పుడు వాటి ప్రయోజనాన్ని పూర్తిగా అనుభవించేందుకై భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థ రైతులకు ఏయే భూములో పైరులకెంత నీరు కావలసినదీ ఎరువులెంత కావలసినదీ సకాలంలో సలహా సమాచారాలు అందించటానికి పూనుకొన్నది. ఇందుకు గాను రైతుల పొలాల్లో ఎరువులను పరీక్షించేందుకై ఒక స్కీమును తయారుచేసింది. ఈ పరీక్షల ఉద్దేశ్యం దిగువన ఉదహరించబడింది.

(i) కేవలం నైట్రోజన్‌వల్ల కలిగే ప్రయోజనమేమిటో అలాగే ఫాస్ఫరస్ వేసినప్పుడు ప్రయోజన మేమిటో తెలుసుకొనటం.

(ii) నైట్రోజన్‌తో, ఫాస్ఫరస్ వేసినప్పటి ప్రయోజనాన్ని తెలుసుకొనటం.

(iii) నైట్రోజెన్, ఫాస్ఫరస్‌లతో పొటాష్ వేసినప్పటి ప్రయోజనాన్ని తెలుసుకొనటం.

(iv) అమ్మోనియం సల్ఫేట్, యూరియా, అమోనియం సల్ఫేట్ - నైట్రేట్ వగైరా దేశంలో తయారయే ఇతర నైట్రోజెన్ ఎరువులో ఒక్కొక్క దాని ప్రయోజనాన్ని తెలుసుకొనటం.

(v) సూపర్ ఫాస్ఫేట్, డైకాల్సియం ఫాస్ఫేట్‌లాంటి ఫాస్ఫేట్ ఎరువుల ప్రయోజనాన్ని తెలుసుకొనటం.

(vi) భూసార పరిస్థితులను, పైరు పెంపకం దిగుబడి పరిస్థితులను పోల్చి పరిశీలించటం.

1957-58లో ఈ జిల్లాతో సహా పది జిల్లాల్లో ఈ పరిశీలనలు జరుపబడుతాయి, ఇందుకుగాను ఈ కింది ప్రత్యేక సిబ్బంది తోడ్పడుతుంది.

సూపర్వైజర్లు—5 ; కెమికల్ అసిస్టెంట్—1; లేబరేటరీ అసిస్టెంట్—; ఫీల్డుమెన్—40; పై తరగతి అక్కౌంటెంట్—1; లేబరేటరీ అటెండర్—1; బంట్రోతు—1.

## జీడిపప్పు పరిశ్రమ

మన దేశంలో జీడిపప్పు పరిశ్రమ చాలా ముఖ్యం. ప్రపంచపు మొత్తం వ్యాపారంలో 100కి 90 పాళ్లు మన దేశానికి చెందినట్టిది. అయితే దీని ముడి పదార్థాలు (పోర్చుగీస్) తూర్పు ఆఫ్రికానుంచి దిగుమతి చేసుకుంటున్నాం. జీడిపప్పు వ్యాపారం ద్వారా మనం డాలర్లు సంపాదించుకుంటున్నాం. ఈ పరిస్థితిలో మనం ఇతర దేశాలపై ఆధారపడకూడదు. మన రాష్ట్రంలో ప్రస్తుతం ఖాళీగావున్న భూములు చాలా వున్నాయి. వీటిలో ఈ పంట వేయవచ్చును. రెండవ ప్రణాళికా కాలంలో కనీసం 20,000 ఎకరాల భూమిలో జీడిపప్పు పండించాలి. ఈ పంట కిందకు తేబడిన కొత్త భూములను గురించి సరిగా లెక్కలు ఉంచాలి. పాతతోటలను, కొత్తతోటలను పోషించి, సాగు విధానాల గురించి తగు సలహాలివ్వాలి.

ఈ స్కీము 1957-58లో గుంటూరు, శ్రీకాకుళం, తూర్పు గోదావరి, మెదకు జిల్లాల్లో అమలు జరుపబడుతుంది. ఇందుకు ఖర్చు రూ. 0.34. లక్ష అవుతుంది. ప్రణాళిక ముగింపునాటికి ప్రతి జిల్లాలో అదనంగా 5000 ఎకరాల భూమిలో ఈ పంట పండించాలి.

## తెగుళ్ళు జబ్బులు తగలకుండా చెఱకుపంట రక్షణ

తెగుళ్ళు జబ్బులు మూలంగా పంట బాగా దెబ్బతిని, రాలుబడి విస్తారంగా నష్టమౌతుంది. మొలకలెత్తే సమయంలోనే పురుగుపట్టుతుంది. సకాలంలో దీన్ని అరికట్టాలి. ఇందుకని ప్రతి ప్రాంతీయ కేంద్రానికి రెండు పవర్ స్ప్రేయర్లను, డస్టర్లను పురుగుమందులను కేంద్రానికి రూ. 1000ల చొప్పున తగ్గింపు ధరలకు సప్లయి చేయాలని

సూచింపబడింది. ఈ కార్యక్రమం ఈ జిల్లాలో బొబ్బిలి, పాలకొండ, పార్వతీపురం, సాలూరుఅభివృద్ధి కేంద్రాల్లో అమలు జరుపబడుతుంది.

## మంచి చెఱకు విత్తనం

చెఱకుపంట దిగుబడి బాగా వుండాలంటె, అందుకు విత్తనం మంచిదిగా వుండాలి. విత్తనం జబ్బుదైతే, పంట నాసిగానూ వుంటుంది. తక్కువగానూ వుంటుంది. సిఓ. 419 రకం విత్తనం పంట దిగుబడి కొన్ని ప్రాంతాలో క్రమేపీ క్షీణిస్తోంది. ఈ ప్రాంతాల్లో జబ్బులేని విత్తనాన్ని వినియోగించాలి. బొబ్బిలిలోని ప్రాంతీయ కేంద్రంలో అరఎకరం భూమిలో విత్తనాన్ని పెంచాలి. ఈ విత్తనం ఈ ప్రాంతంలో 2000ల ఎకరాలకు ఉపయోగపడుతుంది.

## ఫిల్టర్ పాయింట్ గొట్టపు బావులు

ఈ స్కీముకింద ప్రతి వ్యక్తికి తవ్వకపు యంత్ర పరికరాలను కొనేందుకై రూ. 2,500లు మించకుండా అప్పు ఇవ్వబడుతుంది. అప్పు నిబంధనలు కిరాయి కొనుగోలు పద్ధతి ప్రకారం ఉంటవి. వడ్డీరేటు ప్రభుత్వం ఎప్పటికప్పుడు నిశ్చయిస్తుంది. రైతులు ఋణాన్ని 5 సమానదఫాలో చెల్లించాలి. 1957-58లో ఈ జిల్లాలో రెండు ఫిల్టరుపాయింట్ గొట్టపుబావులు నిర్మింపబడుతాయి. ఇందుమూలంగా 20 ఎకరాలు బాగుపడి, అధికోత్పత్తి 10 టన్నులు లభిస్తుంది.

## కిరాయి కొనుగోలుపద్ధతికింద ఆయిల్ ఎంజిన్లు, ఎలక్ట్రిక్ మోటార్ల పంపిణీ

సాగునిమిత్తమై కిరాయి కొనుగోలు పద్ధతికింద ఆయిల్ ఇంజన్లు, ఎలెక్ట్రిక్ మోటార్లు ఈ స్కీము ప్రకారం రైతులకు సప్లయి చేయబడుతాయి. ఎలెక్ట్రిక్ మోటార్ పంప్‌సెట్ విషయంలో రూ. 2,000, ఆయిల్ ఎంజిన్ పంప్‌సెట్ విషయంలో రూ. 4,000 మించకుండా డబ్బు ఇవ్వబడుతుంది. 4 శతివడ్డీతో, 3 శతి సెంటేజ్ రుసుముతో సదరు యంత్రాల ఖరీదు అయిదు మొదను ఏడు సమాన దఫాలో రైతులవద్దనుంచి వసూలు చేయబడుతుంది. 1957-58లో ఈ జిల్లాలో ఈ పద్ధతికింద 10 ఆయిల్ ఎంజిన్ పంప్ సెట్లను 1957-58లో జిల్లాలో కిరాయి-కొనుగోలు పద్ధతి కింద 10 ఆయిల్ ఎంజిన్‌సెట్లు, 15 ఎలెక్ట్రిక్ మోటార్లు పంపిణీ చేయబడుతాయి.

అదనంగా బాగుపడే భూమి ఆయిల్ ఎంజిన్‌కు 8 ఎకరాలు, ఎలెక్ట్రిక్ మోటారుకు 5 ఎకరాలు ఉంటుంది. ఈ స్కీముకింద ఈ జిల్లాలో 77 టన్నుల అదనపు ఉత్పత్తి లభిస్తుంది.

## స్థానిక ఎరువుల అభివృద్ధి

ఈ స్కీము ఉద్దేశ్యం గ్రామాల్లో ఎరువుల ఉత్పత్తిని అధికం చేయటం. స్థానికంగా ఎరువుల కుపయోగపడే వసతులను భద్రంచేసి, మేలురకం విధానాలద్వారా వాటిని కంపోస్టుగా మార్చాలి. ప్రస్తుతం ఇట్టి ఎరువు ఉత్పత్తి పశువుకు టన్ను ఉంటుందని అంచనా వేయబడింది. ఇంకొంచెం శ్రద్ధతో ఉత్పత్తిని రెట్టింపు చేయవచ్చును. ఈ విధంగా ఎరువులో ఉండే నత్రజని 0.5 శతి నుంచి 1 శతికి పెరుగుతుంది. రెండవ ప్రణాళిక కింద అనేక రకాల రసాయనికపు ఎరువులు ఉపయోగింపబడుతవి. వాటికి తోడు ఈ నాటు ఎరువులనుకూడా కలిపివాడాలి. లేకపోతే భూసారం దెబ్బతింటుంది. కాబట్టే స్థానినిక ఎరువులను భూసార భద్రతకై సద్వినియోగం చేయాలని సూచించబడింది. 1957-58లో ఈ స్కీము ఈ జిల్లాలో మూడు బ్లాకుల్లో అమలు జరుపబడుతుంది. ఈ స్కీమును అమలు జరుపటానికి కంపోస్టు ఇన్స్పెక్టర్ అని పిలవబడే ఒక ప్రత్యేక వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్, ఒక ఫీల్డ్‌మన్ నియమింపబడుతారు. వీరికి పదిహేను రోజులపాటు కంపోస్టు ఎరువు తయారీ, నిలవ, వినియోగం విషయాల్లో శిక్షణ ఇవ్వబడుతుంది. శిక్షణ పొందాక వీరు మళ్ళీ నిర్ణీత బ్లాకులో గ్రామానికొకరికి చొప్పున రైతులకు శిక్షణ నిస్తారు.

## వ్యవసాయపు పనిముట్ల పంపిణీ

1957-58లో కిరాయి గొనుగోలు పద్ధతి క్రింద చిన్న రైతులకు మేలురకం వ్యవసాయ పని ముట్లను సప్లయి చేయాలని సూచించబడింది. రైతులో తక్కువ ఆదాయం వారు అధిక సంఖ్యాకులు. ఇంకో విధంగా వారు ఈ మంచి పనిముట్లను కొనుక్కోలేరు. సెంటేజ్‌రుసుం 3శవ మినహా మిగతా కిరాయి కొనుగోలు నిబంధనలన్నీ ఈ విషయంలోనూ వర్తిస్తవి. రూ. 800 లకు మించని ఋణం పనిముట్ల రూపంలో ఒక్కొక్క రైతుకు 4 శతి వడ్డీకి ఇవ్వబడుతుంది. 4 సమాన దఫాల్లో తీర్చుకొనవచ్చును. 1957-58లో ఈ స్కీముకుగాను రూ. 1 లక్ష కేటాయించబడింది. ఈ స్కీము ఈ జిల్లా రైతాంగానికి కూడా ఉపయోగపడుతుంది.

# చిన్న నీటివనర్లసాగు

## వానిగెడ్డ ఆనకట్ట

వానిగెడ్డ కాల్వ పాలకొండనుంచి బయలుదేరుతుంది. పాలరసలకు అవతలనున్న భూమికి దీనివలన సాగు లభిస్తుంది. ఇందుకుగాను పాలకొండనుంచి మూడుమైళ్ళ ప్రదేశంలో ఆనకట్ట కట్టాలి. ఈ స్కీముకు రూ. 9.16 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. ఈ స్కీము అమలు జరుగుతోంది. పని పూర్తిఅయాక, ఇప్పటి 722 ఎకరాల ఆయకట్టుకు అదనంగా 2289 ఎకరాలకు నీటి సాగు లభిస్తుంది. ఈ పని పూర్తి కావటానికిగాను 1957-58లో రూ. 4,365 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## సూరపాడు ఆనకట్ట '

శ్రీకాకుళం జిల్లా సాలూరు తాలూకా సూరపాడు గ్రామంవద్ద అద్దరుగెడ్డకు పైన ఆనకట్ట కట్టటం ఈ స్కీముకింద ఉద్దేశించబడింది. ఇందువల్ల ఇప్పటి 274 ఎకరాల ఆయకట్టకు అదనంగా 1577 ఎకరాల భూమి బాగుపడుతుంది. పని చాలావరకు జరిగింది. ఈ ఏడాది పూర్తికావచ్చును. ఇందుకు రూ. 0.01 లక్ష కేటాయించబడింది.

## చెఱువు స్కీములతో సహా కొత్త స్కీములు

ఆంధ్రప్రాంతంలో కొత్త మైనరు ఇరిగేషన్ స్కీములకు, కొన్ని చెఱువుల పునరుద్ధరణకు ఈ ఏడాది రూ. 17.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో ఈ ఏడాది రెండు మైనరు ఇరిగేషన్ స్కీములు. 53 చెఱువు స్కీములు ప్రారంభించబడుతాయి.

# భూమి అభివృద్ధి

## ట్రాక్టర్లతో, బుల్‌డోజర్లతో సాగు

ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు సాగు విస్తరణకు తోడ్పడుతూ బాగా వ్యాప్తిలోకి వస్తున్నాయి. వీటి గిరాకీ హెచ్చింది - ముఖ్యంగా మెరకప్రాంతాల్లో, తోటలు వేసే ప్రాంతాల్లోనూ, బంజరుభూములను, మొక్క-మోడు పెరిగిన భూములను పునరుద్ధరించటానికి, పనివారు తగినంత మంది లేని ప్రాంతాల్లో భూముల సాగుకు, గట్లు వేయటం వగైరా భూసార సంరక్షణ కార్యక్రమాలకు ఇవి బాగా ఉపయోగపడుతాయి. ఈ యంత్రాల వాడకం మూలంగా మట్టిపని ఖర్చు ఇంచుమించు సగానికి సగం తగ్గుతుంది. ప్రస్తుతం కిరాయికిస్తున్న బుల్‌డోజర్లు రైతుల అవసరాలకు తగినంతగా లేవు. కాగా చాలా యంత్రాలకు కాలదోషం పట్టింది. వీటిస్థానే కొత్త యంత్రాలను వెంటనే ఏర్పాటు చేయాలి. రెండవ ప్రణాళికా కాలంలో 44 కొత్త బుల్‌డోజర్లను సంపాదించాలి. 1957-58లో 12 యంత్రాలను సంపాదించాలని ఉద్దేశించబడింది. ఇవి ఈ జిల్లా రైతులకు కూడా అందుబాటులో వుంటాయి.

## ఆబోతుల దున్నపోతుల ఉచిత పంపిణీ

ఈ స్కీముకింద 1957-58లో ఆబోతులు, దున్నపోతులు రెండు శ్రద్ధ ఆసక్తి వున్న పేద రైతులకు, పంచాయితీలకు ఉచితంగా పంపిణీ చేయబడుతాయి. రైతులు వీటిని ప్రభుత్వశాఖ ఉత్తరువుల ననుసరించి 3 సంవత్సరములపాటు లేక 180 దాట్లు జరిగేవరకు, వీటిలో ఏది ఎక్కువ కాలమైతే అందాకా పోషించాలి. ఆ తర్వాత అవి ఆయారైతులకు స్వంతం అవుతవి. నిర్ణీతగడువు ముగిశాక ఆబోతు కనీసం 60 దాట్లుచేస్తే, ఆ రైతు ఏడాదికి రూ. 220లు ప్రీమియంస్కీముకింద పొందవచ్చును. ఆబోతు ఖరీదు రూ. 1,000.

## వివిధరకాల పశువుల సప్లయి

స్థానిక పశుజాతుల అభివృద్ధికిగాను ఆబోతులను, దున్నపోతులను, పాడి ఆవులను, గేదెలను, మేకలను, పందులను, గొర్రెలను మగ ఆడవాటిని తగ్గింపు ధరలకు

రైతులకు సప్లయిచేయాలని ఉద్దేశించబడింది. 1957-58లో ఈ కింది పశువులు సప్లయి చేయబడుతాయి:—

| | | |
|---|---|---|
| 1. ఆబోతులు | .... | 4 |
| 2. దున్నపోతులు | .... | 4 |
| 3. మేకపోతులు | .... | 3 |
| 4. మేకలు (ఆడ) | ... | 5 |
| 5. పాడి ఆవులు | .... | 2 |
| 6. గేదెలు | .... | 2 |
| 7. పందిపోతులు | .... | 1 |
| 8. పందులు | .... | — |
| 9. పొట్టేళ్లు | .... | 4 |
| 10. గొర్రెలు (ఆడ) | .... | 17 |

## సంచారవైద్యదళాలు, చిన్న పశుచికిత్సాలయాలు, పశుచికిత్సాలయాలు

1956-57లో ప్రభుత్వం ఒక సంచారవైద్యదళాన్ని, ఒక చిన్న పశు చికిత్సాలయాన్ని మంజూరుచేసింది. ఈ ఏడాది ఆంధ్రప్రాంతంలో మరొక అయిదు సంచారదళాలను, రెండు చిన్న చికిత్సాలయాలను, నాలుగు పశువైద్యచికిత్సాలయాలను ఏర్పరచాలని ఉద్దేశించబడింది. వీటిలో ఒక సంచారదళం ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడుతుంది. ఈ దళంపై అజమాయిషీ స్టాక్‌మన్ కాంపౌండరు లేక పశువైద్య లేదా పశుగణ ఇన్‌స్పెక్టరుగాని చూస్తారు.

## కోళ్ళ పెంపకం

ఒక నమూనా ప్రాజెక్టు కోళ్ళ అభివృద్ధి స్కీమును కేంద్రప్రభుత్వం ప్రారంభించింది. దీనిక్రింద ఆంధ్రప్రాంతంలో 1957-58లో 8 కోళ్ళ విస్తరణ కేంద్రాలు ఏర్పాటు చేయబడుతాయి. ఇందులో ఒకటి ఈ జిల్లాలో పనిచేస్తుంది. అభివృద్ధి బ్లాకుతో సహా ఒక ప్రదర్శన యూనిట్‌తో ఈ విస్తరణ కేంద్రం ఏర్పాటు చేయబడుతుంది. ఈ కేంద్రాల్లో నవీన పద్ధతులపై కోళ్ళపెంపకం నేర్పబడుతుంది. గ్రామాల్లో-

వేసవికాలంలో గుడ్లు ఎక్కువకాలం నిలవవుండే విధానాలు అవలంబించబడుతవి. ఇందుకుగాను ఒక డి-ఫెర్టిలైజేషన్ యూనిట్ కూడా ఏర్పాటు చేయబడుతుంది.

## కోడిపెట్టల, పుంజుల పంపకం

మేలురకం జాతులను తగినంతగా అందిస్తే, గ్రామాల్లో కోళ్ళ పెంపకాన్ని చిన్న పరిశ్రమగా పెంపొందింపవచ్చును. ఆంధ్రప్రాంతంలో 1957-58లో గ్రామాల్లో 462 పుంజులను, 462 పెట్టలను, 4000 గుడ్లను పంపిణీ చేయాలని ఉద్దేశించబడింది. వీటిలో 42 పుంజులు, 42 పెట్టలు, 365 గుడ్లు ఈ జిల్లాలో పంపిణీ చేయబడుతాయి. ఒకరోజు పెరిగిన పిల్లలను నాలుగు నెలలపాటు పెంచి, గ్రామస్థుల కిస్తారు.

## జిల్లా రాష్ట్ర పశు ప్రదర్శనలు

రెండవ ప్రణాళికలో ఈ స్కీముకని కేటాయించిన రూ 2 లక్షల్లో, 1957-58లో ఒక రాష్ట్ర పశు ప్రదర్శనాన్ని, ఆంధ్రలో జిల్లాకొకటి చొప్పున 11 జిల్లా పశు ప్రదర్శనలను నిర్వహించటానికి రూ 0.30 లక్ష ఖర్చు పెట్టబడుతుంది. ఇవికాక 38 ఒకరోజు పశుప్రదర్శనాలు కూడా జరుపబడుతాయి. వీటిద్వారా పశుగణాభివృద్ధికి చెందిన వివిధ విషయాలను గురించి శాస్త్రీయ విధానాలు ప్రచారం చేయబడుతాయి.

## కోళ్ళ పెంపకపు పరికరాలు

ఈ స్కీముకింద, ఈ జిల్లాలో రెండు కోళ్ళ పెంపకపు సెట్లను ఏర్పాటు చేయాలని ఉన్నది. మొత్తం ఖర్చు రూ 1,250. ఇందులో రూ 625 లు తిరిగి వసూలు చేయబడుతాయ.

## పాడి ఆవుల సప్లయి

ఈ స్కీముకింద ఈ జిల్లాలో తగ్గింపు ధరలకు తగిన గ్రామస్థులకు 2 ఆవులు సప్లయి చేయబడుతాయి. ఆవు ఖరీదు రూ 1000 లు.

## కోళ్ళ సప్లయి

ఈ స్కీముకింద ఈ జిల్లాలో విరాళపు రేట్లప్రకారం గ్రామస్థులకు 100 పిట్టలు సప్లయి చేయబడుతాయి. పిట్ట ఖరీదు రూ. 10లు ఉంటుంది.

## మేకల గొర్రెల సప్లయి

ఈ జిల్లాలో విరాళపు పద్ధతిన 7 గొర్రెలు సప్లయి చేయబడుతాయి.

## రిండర్ పెస్ట్ నిర్మూలనకు పైలట్ స్కీము

కృష్ణానదికి దక్షిణానవున్న జిల్లాల్లో యావత్తు పశుసంతతిని రిండర్ పెస్ట్ వ్యాధి నుంచి రక్షించవలసిన అవసరం ఉంది. ఇందుకని ఈ స్కీము మొదటి ప్రణాళిక అప్పుడు ఆరంభించబడింది. 1957 మార్చి ఆఖరుకు ఈ పని మూడు జిల్లాల్లో పూర్తి చేయబడింది. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, కృష్ణాజిల్లాల్లో ఈ ఏడాది ఈ స్కీమును అమలు జరుపాలని వున్నది.

# అడవులు

## వర్కింగ్‌ప్లాన్ సర్కిల్

అటవీశాఖ స్వాధీనంచేసుకొన్న ఎస్టేటు అడవులవిషయమై వర్కింగ్ ప్లాను లను తయారు చేసేందుకై ఈ స్కీము ఉద్దేశించబడింది. ఈ విధంగా ఈ అడవులు అటవీశాఖ శాస్త్రీయ నిర్వహణకింద వుంటవి. అవసరమైన సందర్భాల్లో వర్కింగు ప్లానులు సవరింప బడుతవి. 1956-57లో నాలుగు డివిజన్లలో ఒకేసారి వర్కింగ్ ప్లానుల తయారీ ప్రారంభించ బడింది. ఉత్తర విశాఖపట్నం, దక్షిణ విశాఖపట్నం, తూర్పు చిత్తూరు, పడమట చిత్తూరు డివిజన్లు 1957 మార్చి నెలాఖరుకు ప్రతిడివిజను లోనూ మూడోవంతు పని జరిగింది. ఈ ఏడాది కొరదలా పని జరుగుతుంది. ఇందుకై 1957-58లో రూ. 1.62 లక్షల మొత్తం కేటాయించబడింది. శ్రీకాకుళం జిల్లా వాటా రూ. 0.40 లక్ష.

## సరకు తోటలు

వంటచెఱకుగా సరకుకు గిరాకీ హెచ్చింది. ఇందుకుగాను శ్రీకాకుళం, విశాఖ పట్నం, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో సరకుతోటలను పెంచాలి. ఈ స్కీముకు 1957-58లో మొత్తం రూ. 1.30 లక్షలు కేటాయింపబడినవి. ఇందులో రూ. 0.255 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది. పాతతోటలతోపాటు క్రొత్తవి వేస్తారు. ముచ్చిలేశం, బలరామపురం, వత్సవలస ప్రాంతాల్లో 210 ఎకరాలమేరలో సరకుచెట్లు నాటబడుతాయి.

## అడవుల పునరుద్ధరణ

ప్రభుత్వం తీసుకున్న పంచాయితీ, ఎస్టేటు అడవులలో పునరుద్ధరణ ప్రాంతాల నేర్పాటు చేయటానికిగాను ఈ స్కీము అమలు జరుపబడింది. చెట్టుచేమ ఉడిగి పోయిన ప్రాంతాలకు ఈ స్కీము వర్తింప జేయబడుతోంది. 1956-57లో 1616 ఎకరాల ప్రాంతంలో ఇట్టి పునరుద్ధరణ ఖండాలు ఏర్పాటు చేయబడినాయి. 1957-58లో ఈ స్కీముకుగాను రూ. 1.59 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.08 లక్ష ఈ జిల్లాకు కేటాయింపబడింది. టెక్కలి, పార్వతీపురం, పాతపట్నం ప్రాంతాల్లో నూరేసి ఎకరాల చొప్పున మూడు స్థలాల్లో అడవులు పెంచబడుతాయి— పాతస్థలాలకు అదనంగా.

## రిజర్వ్డు అడవుల్లో చెట్టుచేమ నశించిన కొండల్లో అడవులను పెంచటం

రిజర్వ్డు అడవుల్లో చెట్టుచేమ నశించిన కొండల స్లోపులలో గట్టు పద్ధతిన అడవులు ఈ స్కీముకింద పెంచబడుతవి ఇందుమూలంగా భూమికోత నివారింప బడుతుంది. 1956-57లో ఇలా ఆంధ్రప్రాంతమంతటా 95 ఎకరాల మేరలో అడవులను పెంచటం జరిగింది. 1957-58లో ఈ స్కీముకు రూ. 0.13 లక్ష ఇవ్వబడుతుంది. ఇందులో ఈ జిల్లావాటా రు. 0.01 లక్ష. టెక్కలి, పాతపట్నం ప్రాంతాల్లో పది ఎకరాల మేర అడవికింద ఉంటుంది. పాత అటవీ స్థలాల్లోనూ పని జరుగుతుంది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో అడవుల రోడ్లు

శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాల్లోని ఏజెన్సీ ప్రాంతాల్లో రోడ్ల విధానాన్ని అభివృద్ధిపరచటం ఈ స్కీము ఉద్దేశ్యం. ఇందుమూలంగా లోపల అడవులను ఎక్కువగా వినియోగంలోకి తెచ్చుకోవచ్చు. అడవిజాతులవారికి, మైదానపు ప్రజలకు మధ్య సంబంధాలు ఎక్కువై, బాగుపడుతవి. 1957-58లో 42 మైళ్ళ పొడవున రోడ్లకు అభివృద్ధి చేయాలని సంకల్పించబడింది, ఇందుకు రూ. 2.00 లక్షలు కేటాయింపబడినవి. ఇందులో రూ. 0.335 లక్ష శ్రీకాకుళం జిల్లాకు కేటాయించబడింది. పీరఘట్టం దోనుభాయిరోడ్డు 3/0 నుంచి 10/0 (7మై.)వరకు అభివృద్ధి చేయబడుతుంది. రాసులపేట-చినకంబరోడ్డు (4మై. 5 ఫ.) వేయబడుతుంది. దిగువ మెండరెల్ల రోడ్డు % నుంచి 1/4 (1.మై. 4 ప,)వరకు రోడ్డు కంకరతో బాగుచేయబడుతుంది.

# మత్స్యపోషణ

## చేపలసేకరణ, వాటి పంపిణీ

అధికాహారోత్పత్తికై రాష్ట్రంలో త్వరగా పెరిగే చేపలను సేకరించి, పింపిణీ చేయటానికిగాను ఈ స్కీము ఉద్దేశింప బడింది. ఇలా సేకరించిన చేపలను పెంచి, రైలు రోడ్లు ద్వారా ఇతర కేంద్రాలకు సప్లయి చేస్తారు. ఈ పని ఇంకా తీవ్రంగా జరిపేందుకు 1956-57లో ప్రత్యేకసిబ్బందిని నియమించాలని ఉద్దేశించబడింది. ఇంకా రవాణాకని మోటారు వాన్లుకూడా కొనాలి. 70 లక్షల చేపలు సేకరించబడాలి. కాని మంజూరయ్యే నాటికి అదును దాటిపోవటంతో పూర్తిగా స్కీము అమలుకాలేదు. రూ. 4,0 లక్షలతో 1957-58లో ఈ స్కీము పూర్తిగా అమలు జరుపబడుతుంది. ఇందులో రూ. 0.13 లక్ష ఈ జిల్లాకు కేటాయింపబడింది. రెండు లక్షల చిన్న చేప సేకరింపబడిజిల్లాలో ఈ ఏడాది పంపిణీ చేయబడుతుంది.

## తెప్పల దోనెల అభివృద్ధి

నాటురకం దోనెలు, తెప్పలుమూలంగా చాలా కాలహరణం అవుతుంది. గాలి బాగాలేకపోతే, చేపలు పట్టటంఅనేది కొన్నాళ్ళపాటు సాగదు, అంతేకాదు ఎక్కువసేపు పట్టటంకూడా సాధ్యంకాదు. పడేకష్టానికి తగిన ప్రతిఫలం దొరకదు. కాబట్టి వీటిస్థానే మరదోనెలను ఏర్పరచాలి. 1957-58లో రూ. 0.35 లక్ష ఖర్చుతో 5 పడవలను మరపడవలనుగా మార్చాలని ఉద్దేశించబడింది. ఎంజిన్ ఖరీదులో సగం, పడవ ఖరీదులో మూడుపాళ్లు ధరలకు ఇవి చేపలుపట్టేవారికి సప్లయి చేయబడుతాయి. అయిదేళ్ల కాలంలో - చేపలుపట్టే తరుణం మినహా - దఫాలవారిగా చెల్లించుకోవచ్చు. పైకం పూర్తిగా చెల్లించేవరకు పడవలు ప్రభుత్వసొత్తుగా ఉంటవి, 1957-58లో ఈ జిల్లాలో ఒక పడవను మరపడవగా మార్చాలని ఉద్దేశించబడింది. ఇందుకై రూ. 0.07 లక్ష కేటాయించబడింది. ఇందుమూలంగా అదనంగా 10 టన్నుల చేప లభించవచ్చు.

## నైలాన్ వలలు

ప్రస్తుతం చేపలనుపట్టేవలను నూలు, జనపనారతో తయారుచేస్తారు. ఇవి అంత గట్టిగా వుండవు. తాళ్లనుతెంచుకొని చేపలు పారిపోతవి. ఇందుమూలంగా చేపలు పట్టేవారు కొంత నష్టపడుతున్నారు. నైలాన్‌వల చాలామేలు. ఇది ఎక్కువకాలం మన్నుతుంది. ఎక్కువ చేపలనుపట్టుతుంది. మంచి లాభసాటి. మామూలు వలలోకన్న రెట్టింపు చేపలు ఈ వలలో దొరకుతాయి. ఆంధ్రలో రూ. 1.00 లక్ష ఖర్చుతో 200 నైలాన్ వలలను 1957-58లో కొని తగ్గింపు ధరలకు చేపలుపట్టేవారికి, వారి సహకార సంఘాలకు సప్లయి చేయాలని ఉద్దేశించబడింది. వలల ఖరీదు అయిదేళ్ల కాలంలో - చేపలుపట్టె తరుణం మినహా - దఫాలవారీగా చెల్లించబడుతుంది. 200 నైలాన్ వలల ఖరీదులో మూడోవంతు భాగంలో సగంవంతు అయిన రూ. 0.17 లక్షను విరాళంగా ఇవ్వటానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. 1957-58లో 40 నైలాన్‌వలలను కొనటానికి ఈ జిల్లాకు రూ. 0.20 లక్ష కేటాయించబడింది. ఈ వలలమూలంగా 200 టన్నుల ఎక్కువచేపలు లభించవచ్చును.

# సహకార సంఘాలు

## గ్రామ పరపతి సంఘాల విస్తరణ

సహకార ఉద్యమపు అంతిమ లక్ష్యం - ప్రతి గ్రామీణ కుటుంబం సహకార సంఘంలో చేరాలి; 15 ఏళ్లలో గ్రామీణ పరపతిలో సగంవరకు ఈ సంఘాలు నిర్వహించాలి. ఈ లక్ష్యంతో అఖిలభారత గ్రామీణ పరపతిపరిశీలన సంఘంవారు సిఫార్సు చేసిన సూచనల ప్రకారం రాష్ట్రంలో గ్రామీణ పరపతి సంఘాలను పునర్నిర్మాణం చేయటం, దృఢపరచటం విస్తరించటం ఈ స్కీముకు లక్ష్యం. ఈ స్కీము ముఖ్య ఉద్దేశ్యాలు: —

(అ) 1960-61 చివరకు గ్రామాల్లో 100 కి 86 కు. జనాభాలో 100 కి 45 మందికి సహకార ఉద్యమాల్ని వ్యాప్తి చేయాలి.

(ఆ) సుమారు 500 భారీ ప్రాథమిక పరపతి సంఘాలను ఏర్పాటు చేయటం. ఈ ప్రాంతాలు పెద్దవిగా ఉంటవి. సభ్యత్వం బహుళంగా ఉంటుంది. వ్యాపారం విస్తారంగా ఉంటుంది. ప్రభుత్వం భాగస్వామిగా ఉంటుంది. జీతపు పద్ధతిన నిర్వాహక సిబ్బంది పని చేస్తుంది.

(ఇ) వ్యవసాయదారులకు తక్కువగడువు. మధ్యరకం అప్పులను క్రమేపీ అధికంగా ఇవ్వటం.

(ఈ) అమ్మకంతో పరపతిని సరిగా సమన్వయం చేయటం.

ఈ స్కీము 1956-57లో అమలు జరుపబడింది. ఇందుకుగాను వివిధస్థాయిల్లో సిబ్బందిని పెంచటమైంది. పర్యవేక్షణకు, నిర్వహణకు శిక్షిత సిబ్బందిని నియమించుకొనేందుకై కేంద్ర సహకార బ్యాంకులకు, పెద్ద సంఘాలకు ఆర్థిక సహాయం చేయబడింది. ఈ ఏడాది ఈ జిల్లాలో 6 పెద్ద ప్రాథమిక పరపతి సంఘాలు, ఒక గ్రామీణ బ్యాంకు ఏర్పాటు చేయబడుతాయి. ప్రస్తుతం ఉన్న చిన్న సంఘాలు తీవ్రంగా పని చేస్తాయి. అవసరమైన ప్రదేశాల్లో చిన్న సంఘాలూ ఏర్పాటు చేయబడుతాయి. 1957-58 ఆఖరుకు 1305 గ్రామాలకు, 4.59 లక్షల మందికి ఈ పరపతి సంఘాలు ఉపయోగపడాలని సంకల్పించబడింది. ఈ జిల్లాలో రూ. 32.00 లక్షలవరకు తక్కువ

గడువుకింద, మధ్యరకంకింద రూ. 5.00 లక్షలవరకు ఉత్పత్తి ఆధారంగా ఆర్థిక సహాయం చేయాలని ఉన్నది.

ఈ విస్తరణ కార్యక్రమాల సందర్భంలో సహకార సంఘాలపై అజమాయిషీని నిర్దుష్టంగా సాగించటానికి, ఈ జిల్లాలోని రెండు డిప్యూటీ రిజిస్ట్రార్ కేంద్రాల్లో ప్రతి కేంద్రంలో ఒక సీనియర్ ఇన్‌స్పెక్టరు, ఒక జూనియర్ ఇన్‌స్పెక్టరు నియమింప బడుతారు. ఈ జిల్లాలో 1957-58లో ప్రారంభించాలనుకుంటున్న గ్రామీణ బ్యాంకుకు కార్యదర్శిగా పని చేయటానికి ఒక సీనియర్ ఇన్‌స్పెక్టరు నియమింప బడుతాడు. యావత్తు ఖర్చునూ ప్రభుత్వం భరిస్తుంది. ఈ ఏడాది ఏర్పాటు కావలసిన పెద్ద సంఘా లన్నిటి నిర్వాహక సిబ్బంది ఖర్చునూ ప్రభుత్వం విరాళాల రూపంలో భరిస్తుంది– 1956-57లో ఏర్పాటైన 3 సంఘాల సిబ్బంది ఖర్చులో 3/4 వంతులో పాటు.

## భూమి తనఖా బ్యాంకుల ద్వారా దీర్ఘకాలపు అప్పులు

ఈ స్కీముకింద, 20 సంవత్సరాల్లో తీర్చుకోదగు దీర్ఘకాలపు ఋణాలు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా ఇవ్వబడుతవి. భూమి అభివృద్ధికి, నీటి సాగు వసతులకు, భూమి పునరుద్ధరణకు ఈ ధనం వినియోగింపబడుతుంది. పెద్ద పెద్ద నీటిసాగు ప్రాజెక్టుల ఫలితంగా ప్రతి ఏడాది ఎంతో భూమి సాగు కిందకు తేబడుతోంది. ఈ కార్యక్రమానికి దీర్ఘకాలపు ఆర్థిక సహాయం అవసరం. అందుకు తగిన సంస్థ సహకార భూమి తనఖా బ్యాంకు. 1956-57లో ఈ స్కీము అమలు జరుపబడింది. ఈ ఏడాది ఈ జిల్లాలో రూ. 4.20 లక్షలవరకు దీర్ఘకాలపు ఋణాలు ఇవ్వబడుతాయి. అధికమవుతున్న పని తాకిడీని తట్టుకొనటానికిగాను, ఈ జిల్లాలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులకు ఇద్దరు సూపర్‌వైజర్లు నియమింపబడుతారు.

## సహకార సంఘాల నిర్వాహకులకు, సభ్యులకు శిక్షణ

ఇదొక కొత్త స్కీము. గ్రామ పరపతి సంఘాల సభ్యులకు 2,3 రోజులపాటు శిక్షణ ఉంటుంది. పంచాయతీదార్లకు సుమారు ఒక వారం, సంఘాల అధ్యక్షులకు, కార్యదర్శులకు, జీతపు సిబ్బందికి 5,6 వారాలు శిక్షణ ఉంటుంది. సహకార సూత్రాలు, ఆచరణ, సంస్థల నిర్వహణ, లెక్కలు వ్రాయటం వగైరా విషయాలను గురించి బోధనఉంటుంది.

1957–58 లో రాష్ట్రమంతటా ఈ స్కీము అమలు జరుపబడాలని ఉద్దేశింప బడింది. ఇందుకు సిబ్బంది కింది విధంగా ఏర్పాటుచేయ బడుతుంది—ఒక సహకార సబ్-రిజిస్ట్రార్, 23 డిప్యూటీ రిజిస్ట్రార్ కేంద్రాలలో ప్రతి ఒక దానికి ఒక సీనియర్ ఇన్‌స్పెక్టరు, రాష్ట్ర సహకార సమితికి ఒక డిప్యూటీ రిజిస్ట్రార్ ఈ ఏడాది జిల్లాలో 300 మంది సభ్యులకు, నిర్వాహకులకు, సిబ్బందికి శిక్షణ ఇవ్వాలని ఉద్దేశించబడింది.

## పరిశోధన, పరిశీలన, అంకెలు

ఇదొక కొత్త స్కీము. 1957–58లో దీనిని అమలు జరపాలి. సహకార శాఖలో దీని కింద ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ స్కీముల ఇబ్బంది సౌబ్బందులను ప్రయోజనాలను పరిశీలించి, విధానాలను సూచించి లోపాలేమైనా వుంటే పరిష్కార మార్గాలను ఈవిభాగం నిర్దేశిస్తుంది. ఇందుకు సిబ్బంది–ప్రధాన కార్యాలయల్లో ఒక సహకార సబ్-రిజిస్ట్రార్, ఒక సీనియర్ ఇన్స్పెక్టర్, ఒక జూనియర్ ఇన్‌స్పెక్టర్, ఒక టైపిస్టు, ఇద్దరు బంట్రోతులు. వీరు ఫీల్డ్ సిబ్బంది చేసే పనిని కనిపెట్టుతూ, ఆదేశిస్తూ, సమీక్ష చేస్తూవుంటారు. రాష్ట్రపు 20 జిల్లాలలో పరిశీలనలు జరిపి, అంకెలను లెక్కించేందుకు జిల్లా కొక సీనియర్ ఇన్‌స్పెక్టరు నియమింపబడుతాడు.

## రాష్ట్రసహకార అభివృద్ధి నిధి

కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసే "జాతీయ సహకార అభివృద్ధి నిధి" తోపాటు ఒక "రాష్ట్ర సహకార అభివృద్ధి నిధి"ని కూడా ఏర్పాటు చేయాలని, అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం సిఫార్సులబట్టి ఉద్దేశించ బడింది. వవ్యసాయాభివృద్ధిలో విక్రయం, తయారీలాంటి అనుబంధ కార్యక్రమాల్లోపాల్గొనే సహకార సంఘాలకు ఆర్థిక సహాయాన్ని కల్గించటం ఈ నిధిలక్ష్యం. పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం రూ. 2 లక్షలతో ఈ నిధిని ప్రారంభించింది. కాని ఇప్పటి విస్తృత ఆంధ్ర ప్రదేశ్ అవసరాలకు ఈ మొత్తం చాలదు. అందుకని 1957–58లో ఈ మొత్తాన్ని మరొక లక్ష రూపాయలతో అధికం చేయాలని సంకల్పించబడింది. ఈ నిధి కింద ఈ జిల్లాకూడా ఆర్థిక సహాయాన్ని పొందుతుంది.

## వ్యవసాయ పరపతి [సహాయం, హామీ] నిధి

కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసే "జాతీయ వ్యవసాయ పరపతి (సహాయం. హామీ) నిధికితోడు అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘపు సిఫార్సుల బట్టి. ఒక రాష్ట్ర వ్యవసాయ పరపతి (సహాయం, హామీ) నిధిని ఏర్పాటు చేయాలని ఉద్దేశించబడింది. మొండి బాకీలను రద్దుచేయటం వలన అయ్యే నష్టాలను భరించేందుకుగాను సహకార పరపతి సంఘాలకు సహాయపడటం ఈ నిధి లక్ష్యం. పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం రూ. 1.50 లక్షలతో ఈనిధిని ప్రారంభించింది. ఆంధ్ర ప్రదేశ్ అవసరాలకు అనుగుణంగా 1957—58లో ఈమొత్తాన్ని మరొక రూ. 1 50 లక్షలతో పెంచాలని ఉద్దేశించబడింది. ఈ స్కీము ఈ జిల్లాకుకూడా వర్తిస్తుంది,

# గిడ్డంగులు, విక్రయం

## సహకార విక్రియాభివృద్ధి

అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం సిఫార్సు చేసిన గ్రామీణ పరపతి సమగ్ర పథకంలో ఒక భాగం ఈ స్కీము. కింది విధానాల ప్రకారం సహకార సంఘాల ద్వారా వ్యవసాయ విక్రయపుఏర్పాట్లను అభివృద్ధి చేయటం ఈ స్కీముకు లక్ష్యం.

(i) వ్యవసాయ ఉత్పత్తి మీద అధికంగా ఋణాలను ఇవ్వటం.

(ii) అన్ని ముఖ్య వ్యాపార కేంద్రాల్లో, కేంద్ర గ్రామాల్లో గిడ్డంగుల నిర్మాణం, గిడ్డంగుల వసతులను సమకూర్చటం.

(iii) ప్రభుత్వ సహాయంతో తయారీ విధానాలను ఏర్పాటుచేసే విషయమై విక్రయ సహకార సంఘాలకు సాయపడటం.

(iv) వ్యవహారాలను నిర్వహించేందుకు శిక్షిత సిబ్బందిని నియమించటానికి సంఘాలకు ఆర్థిక సహాయాన్ని సమకూర్చటం.

వ్యవసాయ పరపతి సంఘాలకు, విక్రయ సహకార సంఘాలకు మధ్యన సన్నిహిత సంబంధాన్ని చేకూర్చటం ఈ స్కీముకు ఉద్దేశ్యం. విక్రయ సంఘం ద్వారా తమ మిగులు పంటను విక్రయించుకోవలసిందిగా పరపతి సంఘాల సభ్యులకు బాధ్యత నొప్పగిస్తుంది. గ్రామీణ పరపతి సమగ్ర పథకం కింద ఏర్పాటు చేయాలనుకుంటున్న రాష్ట్రి గిడ్డంగి కార్పొరేషన్ విక్రయ సంఘాలు కలసి పని చేయాలని కూడ ఈ స్కీము సంకల్పం.

ఆంధ్ర ప్రాంతంలోని 11 జిల్లాల్లో వున్న 40 విక్రయ సంఘాలను దృఢపరచటానికితోడు, 1957-58లో ఒక రాష్ట్రి విక్రయ సంఘాన్ని కూడ ఏర్పాటు చేయాలని ఉద్దేశించ బడింది. సంఘానికి రూ. 10, 000 చొప్పున రూ. 4. లక్షలు వరకు ప్రభుత్వం కూడా పాల్గొంటున్నది. జిల్లా కేంద్ర విక్రయసంఘాల షేరు ధనానికిగాను రూ. 1.00 లక్ష మొత్తం ఇవ్వబడాలని సూచించబడింది.

విక్రయ పరిస్థితులు బాగుపడే వరకు సరకును ఉంచుకునేందుకుగాను, ఈ జిల్లా ఉత్పత్తిదార్లకు రూ. 15 లక్షల వరకు తక్కువ గడువు విక్రయ ఆర్థిక సహాయం చేయబడుతుంది.

## రాష్ట్రగిడ్డంగి కార్పొరేషన్

వ్యవసాయం గురించి పరిశీలించ వలసిందిగా నియమింపబడిన రాయల్ కమిషన్, కేంద్ర బ్యాకింగ్ పరిశీలనా సంఘం, మార్కెటింగ్ సబ్-కమిటీ, వ్యవసాయ ఆర్థిక ఉప-సంఘం, సహకార ప్లానింగు సంఘం, గ్రామీణ బ్యాంకింగ్ పరిశీలనా సంఘం, చివరకు అఖిల భారత గ్రామీణ పరిశీలనా సంఘం వగైరా అనేక కమిటీలు, కమిషన్లు దేశంలో గిడ్డంగుల ఆవశ్యకతను నొక్కి చెప్పతూనే వున్నవి. గిడ్డంగుల రసీదులు లేకపోవటం వలన, విక్రయ వ్యవహారాల విషయంలో ఆర్థిక సహాయాన్ని సమకూర్చేందుకుగాను రిజర్వుబ్యాంకు 17 వ సెక్షన్ కింద రిజర్వుబ్యాంకు సహకార, షెడ్యూల్ బ్యాంకులకు సహాయ పడటానికి వీలుపడదు. పరపతి సంఘాలు. ఇతర సంఘాలు. వాటిమధ్య ముఖ్యమైన లంకెగా వుంటవి గిడ్డంగుల ఏర్పాట్లు. కాబట్టి ఒక కేంద్ర గిడ్డంగి కార్పొరేషన్‌ను స్థాపించాలని కేంద్రప్రభుత్వం ఉద్దేశించింది. దీనికితోడు రాష్ట్రగిడ్డంగి కార్పొరేషన్లను రాష్ట్రాలు స్థాపిస్తవి. ఇవి జాతీయ సహకార అభివృద్ధి. గిడ్డంగిబోర్డు అజమాయిషీకింద పనిచేస్తాయి. కేంద్ర గిడ్డంగి కార్పొరేషన్‌కు పెట్టుబడి ధనం రూ. 10 కోట్లు ఉంటుంది. ఇందులో జాతీయ సహకార అభివృద్ధి గిడ్డంగి బోర్డుద్వారా కేంద్రప్రభుత్వం రూ. 4 కోట్లు సమకూరుస్తుంది. మిగతా మొత్తాన్ని ఇండియా స్టేట్ బ్యాంక్, షెడ్యూల్డ్ బ్యాంకులు, సహకార సంస్థలు వగైరా సమకూరుస్తాయి. సుమారు 100 ముఖ్యకేంద్రాల్లో కేంద్ర గిడ్డంగి కార్పొరేషన్ పెద్ద గిడ్డంగులను నిర్మిస్తుంది. గిడ్డంగుల రసీదుల మీద బ్యాంకులు వ్యవసాయోత్పత్తి నాధారంచేసుకొని ఋణాలనిస్తవి. రాష్ట్ర గిడ్డంగి కార్పొరేషన్ ఏర్పాటుకై 1956-57లో షేరుకు రూ. 100ల మొత్తం కేటాయించబడింది. కాని అప్పట్లో ఆంధ్రప్రదేశ్ నిర్మాణ సందర్భం బట్టి ఆ స్కీము అమలు కాలేదు. రూ. 15 లక్షల పెట్టుబడితో 1957-58లో కార్పొరేషన్ ఏర్పాటు చేయాలని ఉన్నది. కేంద్రగిడ్డంగి కార్పొరేషన్ రూ. 7.50 లక్షల షేరు కేపిటల్‌ను సమకూరుస్తుంది. మిగతా మొత్తాన్ని రాష్ట్రప్రభుత్వం జాతీయ సహకార అభివృద్ధి గిడ్డంగి బోర్డునుంచి ఋణంతీసుకొని సర్దుతుంది. ఈ గిడ్డంగి వసతులు ఈ జిల్లాకు కూడా వర్తిస్తవి.

## జాతీయవిస్తరణ, సమాజాభివృద్ధి ప్రాజెక్టులు

యావత్తు సమాజము ఆర్థికంగా, సాంఘికంగా పురోగమించటానికి, ప్రజలు తమంతటతాము ఈ కార్యక్రమాల్లో పాల్గొనటానికి అనువైన పరిస్థితుల నేర్పాటు చేయటానికై సమాజ వికాస కార్యక్రమం ఉద్దేశించ బడింది. 1952 అక్టోబరులో ఆరంభమైన సమాజ వికాస ఉద్యమం గ్రామీణ శ్రేయస్సును సాధించే ఉత్తమ విధానంగా తయారైంది. మొదటి ప్రణాళికా సమయంలో ఈ ఉద్యమం ఎంతగానో జయప్రదమయింది. దేశ ఆర్థికాభ్యుదయంతో ఈ ఉద్యమానికి శాశ్వత స్థానం లంభించింది. గ్రామీణ అభివృద్ధి దీని ప్రత్యేకత. 1957 మార్చి ఆఖరుకు, ఈ జిల్లాలో 4 జాతీయ విస్తరణ బ్లాకులు, 3 సమాజాభివృద్ధి బ్లాకులు ఉన్నవి. వీటి వైశాల్యం 596.09 చదరపు మైళ్లు. జనాభా 5,36,524 మంది. గ్రామాలు 764. 1957-58లో మరొక 4 జాతీయ విస్తరణ బ్లాకులు ఏర్పాటు చేయటంతో అప్పటితో మొత్తం 11 బ్లాకులు ఉంటాయి. ఇచ్ఛాపురం సమాజాభివృద్ధి బ్లాకు ఈ ఏడాది అభివృద్ధి-అనంతర బ్లాకుగా మార్చబడుతుంది.

ప్రణాళిక గురించి, దానిని జయప్రదం చేయవలసిన బాధ్యతగురించి ప్రజలకు ప్రబోధంచేసి, తద్వారా రెండవ ప్రణాళిక విజయానికి ఈ బ్లాకులు తోడ్పడుతాయి.

# పెద్ద మధ్యరకం నీటివనర్లసాగు

## వంశధార ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టుకింద గొట్టవద్ద ఒక అనకట్ట నిర్మింపబడుతుంది. జలాశయం 19,173 మి. క్యూ. అడుగులు ఉంటుంది. కుడికాల్వ పొడవు 33 మైళ్లు. దీనికింద ఆయకట్టు 73,750 ఎకరాలు. ఎడమకాల్వ పొడవు 60 మైళ్ళు. దీనికింద ఆయకట్టు 13,400 ఎకరాలు. గొట్టకు 26 మైళ్ళు ఎగువన సింగిడిలవద్ద ఒక బ్యారేజీని కూడా నిర్మించాలని ఉన్నది. 27 మైళ్ళ కుడికాల్వ 18,000 ఎకరాల ఆయకట్టుకు ఉపయోగ పడుతుంది. కాని కేంద్రజల విద్యుత్ కమిషన్ సభ్యుడైన డా. కె. యల్. రావు సలహానను సరించి, ఒరిస్సా రాష్ట్రంలోని గుడారిని జలాశ్రయ స్థలంగా ఎంచుకొనట మైనది. ఈ స్థలంవద్ద పరిశీలనలు జరుపబడుతున్నవి. ఇందుకుగాను 1957-58లో రూ. 5.0 లక్షలు కేటాయింపబడినవి.

## నారాయణపురంవద్ద నాగావళిపై అనకట్ట నిర్మాణం

తోటపల్లి రెగ్యులేటర్‌కి 35 మైళ్ళ దిగువన నారాయణపురంవద్ద మూడు అడుగుల వాలుడు షట్టర్లతో ఒక బెడ్-రెగ్యులేటర్ ఈ స్కీముకింద నిర్మించ బడుతుంది. కుడికాల్వ పొడవు 23 మైళ్ళ 2 ఫర్లాంగులు, ఎడమవైపు కాల్వ 9 మైళ్ళ 6 ఫర్లాంగులు. 27,617 ఎకరాల ప్రస్తుత ఆయకట్టుకు నీటిసప్లయిను స్థిరపరుస్తూ, కొత్తగా 9,200 ఎకరాల భూమికి నీటిసాగును ఈ స్కీము చేకూరుస్తుంది. ఈ పనులకు రు. 16.39 లక్షలు కేటాయింప బడినాయి.

## నాగావళి కుడివైపు కాల్వ

తోటపల్లి రెగ్యులేటర్‌వద్ద పెద్ద తూముఉంటుంది. అక్కడనుంచి 13 మైళ్లు 4 ఫర్లాంగుల కాలవతవ్వబడుతుంది. పార్వతీపురం, బొబ్బిలితాలూకాల్లో 6360 ఎక రాల పాత ఆయకట్టుకు, 2640 ఎకరాల కొత్తసాగుకు నీటి సప్లయిలభిస్తుంది. ఇది వరలో ఈ ప్రాంతాలకు తగిన శ్రద్ధచూప బడలేదు. ఈ ఏడాది ఈ స్కీముపూర్తి కావచ్చు. ఇందుకు రూ. 0.40 లక్ష కేటాయించ బడింది.

## వేగవతి ఆనకట్ట స్కీము

సాలూరునుంచి 8 మైళ్ళ దూరంలోవున్న కర్రివలస గ్రామంవద్ద వేగవతిపై ఈ స్కీముకింద ఆనకట్ట నిర్మించ బడుతుంది. ఆనకట్టపొడవు 300 అడుగులు. రెండు పంటకాల్వలకు రెండు పెద్దతూములుంటాయి. ఎడమవైపు కాల్వ 5 మైళ్ళ 4 ఫర్లాంగులు. కుడివైపు కాల్వ 6 మైళ్ళ 4 ఫర్లాంగులు. ఈ స్కీముకు సంబంధించిన పనులన్నీ చురుగ్గా సాగుతున్నవి. ఈ ఏడాది పూర్తికావచ్చు. ఇందుకై రూ 2.0 లక్షలు కేటాయింప బడినవి. ప్రస్తుతపు 4,430 ఎకరాల ఆయకట్టుకు అదనంగా 1921 ఎకరాల భూమికి కొత్తగా నీటిసాగు లభిస్తుంది.

## సీతానగరం ఆనకట్టస్కీము .

సీతానగరానికి 5 మైళ్ళ ఎగువగా వెంకట భైరవీపురం గ్రామానికి సమీపంలో స్వర్ణముఖినదికి ఆనకట్ట నిర్మింప బడుతోంది. కుడిపక్క కాల్వ 9 మైళ్ళు. ఎడమపక్క కాల్వ $3\frac{1}{2}$ ఫర్లాంగులు. ఇందుమూలంగా ఇప్పటి 2,041 ఎకరాల ఆయకట్టుకు నీటి వసతి స్థిరంగా ఉండి, కొత్తగా 2,421 ఎకరాల భూమికి నీటిసాగు లభిస్తుంది. ఈ స్కీముకు సంబంధించిన పనులు చురుగ్గా జరుగుతున్నాయి. 1957-58లో ఇందుకై రూ. 0.50 లక్ష కేటాయించ బడింది.

# విద్యుచ్ఛక్తి

## మచ్‌కుండ్ జలవిద్యుచ్ఛక్తి స్కీము

ఈ స్కీముకింద ఒక్కొక్కదానికి 17,000 కి.వా. శక్తివున్న మూడు ఉత్పత్తి యూనిట్లు పనిచేయ నారంభించినాయి. 4,5,6 సెట్లస్థాపన విషయంలో ప్రాతిపదిక పనులు కొన్ని పూర్తిచేయబడినాయి. 1957–58లో 4,5,6 యూనిట్లస్థాపన పని సాగుతుంది. సుమారు 1958 డిసెంబరు నెలకు 4,5.యూనిట్లు పని చేయవచ్చును. 1959 మార్చి ప్రాంతాల్లో 6వ యూనిట్టు పనిలోకి రావచ్చును. ఈ ఏడాది ఈ స్కీముకు రూ. 121.64 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ.74.00 లక్షలు ఈ జిల్లావాటా.

## గ్రామీణ విద్యుచ్ఛక్తి

1956-57లో ఆంధ్రప్రాంతంలో 198 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడింది. ఈ ఏడాది మరొక 206 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేయాలని ఉన్నది. వీటిలో పదిగ్రామాలు ఈ జిల్లాకు చెందినవి. గరివిడివద్దనున్న ఫెర్రో-మాంగనీస్ ఫాక్టరీకి, ఇతరములకు విస్తరణల పని ఈ ఏడాది కొంత జరుగుతుంది.

# పెద్దరకం, మధ్యరకం పరిశ్రమలు

## సహకార పంచదార ఫాక్టరీలు

ఈ స్కీముకింద ఆంధ్రప్రాంతంలో అయిదు సహకార పంచదార ఫాక్టరీలు ఏర్పాటు చేయబడుతాయి—రెండవ ప్రణాళికకాలంలో రూ. 60.77 లక్షలు ఇందుకు కేటాయించబడినాయి. ఒక్కొక్క ఫాక్టరీ 600 నుంచి 700 టన్నులదాకా చెఱకు ఆడుతుంది. వీటిలో ఒకటి ఆముదాల వలసలో ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకై 1956-57లోనే ఒక సహకార సంఘం రిజిస్టరు చేయబడింది. షేరు కాపిటల్ వసూలు, స్థల నిర్ణయం వగైరా పనుల నిమిత్తం ఒక డిప్యూటీ రిజిస్ట్రార్ ఈ సంఘానికి ఉచితంగా పని చేస్తాడు. షేరు కాపిటల్ సేకరణ చురుగ్గా సాగుతోంది. ఈ ఏడాది ఈ స్కీముకని కేటాయించిన రూ. 24.36 లక్షలలో ఈ సంఘానికి రూ. 12.072 లక్షలు వినియోగమవుతాయి—షేరు కాపిటల్‌లో ప్రభుత్వం వాటా రూ. 12.00 లక్షలు. డిప్యూటీ రిజిస్ట్రార్ జీతం వగైరాలకు రూ. 0.072 లక్ష.

# గ్రామపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు

## కమ్మరపు ఉత్పత్తి—శిక్షణకేంద్రాలు

వ్యవసాయ పనిముట్లు వగైరాలను తయారు చేయటంలో, మరమ్మతు చేయటంలో 12మంది కమ్మరం పనివారికి శిక్షణ ఇవ్వటానికిగాను శ్రీకాకుళంలో 1956-57లో అద్దె కట్టడంలో ఒక కేంద్రం ఏర్పాటు చేయబడింది. 1957-58లో ఈ కేంద్రంలో 12 మంది శిక్షణపొందుతారు—11 నెలలపాటు. నెలకు స్టైయిపెండు రూ. 30 లు ఈ కేంద్రానికి పక్కా-కట్టడం నిర్మింప బడుతుంది.

## వడ్రంగపు ఉత్పత్తి — శిక్షణకేంద్రం

వడ్రంగపు పనిలో 12 మందికి తగిన శిక్షణ ఇవ్వటానికి 1956—57లో శ్రీకాకుళంలో ఒక ఉత్పత్తి — శిక్షణకేంద్రం ఒక అద్దెకట్టడంలో ఏర్పాటు చేయబడింది. శిక్షణ 11 నెలలపాటు వుంటుంది. స్టైయిపెండునెలకు రు. 30 లు. ఈ ఏడాది 12 మంది శిక్షణ పొందుతారు. ఈ కేంద్రానికి పక్కా- కట్టడం నిర్మింపబడుతుంది.

## పరిశ్రమలకు ప్రభుత్వ సహాయచట్టంకింద ఋణాలు

ఆంధ్రప్రాంతంలో కుటీర పరిశ్రమలను, చిన్నపరిశ్రమలను అభివృద్ధి పరచటానికి రూ. 4 లక్షల వరకు ఋణాలను పరిశ్రమలకు ప్రభుత్వపు సహాయపు చట్టంకింద మంజూరు చేయాలని ఉద్దేశించ బడింది. రాష్ట్రస్థాయిలో ఋణాలు మంజూరు చేయబడి, పంపిణి చేయబడుతాయి. ఈ జిల్లాలోని పారిశ్రామికులకు కూడా ఈ ఋణసౌకర్యం వర్తిస్తుంది.

## పరిశ్రమలు వాణిజ్యశాఖను దృఢపరచటం

చిన్నపరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన పని పెరిగి పోతోంది. దీనికి తట్టుకొనగలిగేందుకు గాను, 1957_58లో రూ. 1.18 లక్షల ఖర్చుతో పరిశ్రమలు, వాణిజ్యశాఖ డైరెక్టరు ప్రధాన కార్యాలయ సిబ్బందిని, జిల్లా నిర్వాహక సిబ్బందిని బలపరచాలని ఉద్దేశించ బడింది, ఈ స్కీము ఈ జిల్లాకూ వర్తిస్తుంది.

# కుటీర పరిశ్రమలు

## పల్లెల్లో పనివారలకు ఋణాలు

వివిధ కుటీర పరిశ్రమల్లో పని చేస్తున్న పనివారలకు తోడ్పడేందుకై ఆంధ్ర ప్రాంతంలో ఋణాల రూపంలో 1957–58 లో రూ. 1 లక్ష పంపిణీ చేయాలని ఉద్దేశించ బడింది. ఈ ఏడాది ఈ జిల్లాలో పనివారలకు రూ. 11,000ల మొత్తం అప్పురూపంలో ఇవ్వబడుతుంది.

## ప్రాథమిక సంఘాలకు వాటాధనం, పెట్టుబడి ఋణాలు

చేనేతసంఘాల్లో నేతపనివారు సభ్యులు కాగలిగేందుకుగాను ఈ స్కీముకింద వారికి ఋణాలు ఇవ్వబడుతాయి. 1956-57లో ఈ విధంగా 5,000 మంది చేరారు. సహకార సంఘాలు 256.88 లక్షల గజాల బట్టను తయారు చేసినాయి. ఈ ఏడాది మరొక 5,000 మందిని చేర్పించాలి. 276 లక్షల గజాలబట్ట తయారు కావాలి. ఈ సంఘాల పెట్టుబడి నిమిత్తం ఋణాలను మంజూరు చేయాలని కూడా ఉద్దేశించబడింది. 1957-58లో ఈ జిల్లాలోని 500 మంది నేతవారికి రూ. 1.06 లక్షలు ఋణరూపంలో ఇవ్వబడుతాయి.

## ఆంధ్ర చేనేత పనివారల సంఘపు విక్రయ సంస్థ విస్తరణ

ఆంధ్ర చేనేతపనివారల సహకార సంఘపు విక్రయ సంస్థను విస్తరించటం ఈ స్కీముకు ఉద్దేశ్యం. చేనేత పరిశ్రమను అభివృద్ధి పరచటానికి పూనుకొన్న వివిధ కార్యక్రమాల ఫలితంగా, చేనేత బట్ట ఉత్పత్తి అధికం అవుతుంది. మరి ఈ బట్టను సరిగా విక్రయించటానికి, సమర్థవంతమైన విక్రయసంస్థ ఉండాలి. 1956-57లో 13 అమ్మకపు కొట్లు, ప్రదర్శన శాలలు ఏర్పాటు చేయబడినాయి. ఒక సంచారపు మోటారు వాన్‌ను కొన్నారు. ఇద్దరు ప్రాంతీయ విక్రయాధికార్లు నియమింపబడ్డారు. 1957-58లో మరొక 13 కొట్లు. శాలలను ప్రారంభించాలని, ఒక మోటారును సంపాదించాలని, ఒక ప్రాంతీయ విక్రయాధికారిని నియమించాలని ఉన్నది. వీటిలో రెండు అమ్మకపు కొట్లు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడుతాయి.

## పని విధానాల అభివృద్ధి

మిల్లులతో పోటీ చేయటానికి, ప్రజల మారుతున్న అభిరుచులను తృప్తి పరచటానికి పసందైన చక్కని రకాలను తయారుచేయటానికి చేనేత విధానాలను సాంకేతికంగా అభివృద్ధి పరచటం అవసరం. ఇందు నిమిత్తమై ఈ ఏడాది ఈ జిల్లా నేతపనివారికి 180 స్టాండర్డుకీళ్లు, 36 పరికరాలు. 12 వార్పింగ్ యంత్రాలు, 108 ఫ్రేం. పెడల్ మగ్గాలు, 120 డాబీలు సప్లయి చేయబడుతాయి.

## చేనేతబట్ట అమ్మకంపై ముదరా

చేనేతబట్ట అమ్మకాన్ని అధికం చేయటానికి, ఆంధ్ర చేనేత పనివారల సంఘపు కొట్లు కేవలం చేనేత బట్ట వ్యాపారం చేసే ఇతర సంస్థలు రూపాయకు 9 నయాపైసలను ముదరగా ఇస్తాయి. 1957-58లో రూ. 15.00 లక్షలతో ఈ స్కీము నడుపబడుతుంది. ఈ ముదరా ఈ జిల్లాలో అమ్మకాలకూ వర్తిస్తుంది.

## నేతపనివారలకు గృహవసతి

నేతపనివారు ఆరోగ్యంగా, అనుకూలంగా ఉండే పరిసరాల్లో పనిచేసుకొనేందుకై వీలుగా వారి గృహవసతి పరిస్థితులను అభివృద్ధి చేయటానికి ఈ స్కీము ఉద్దేశించ బడింది. చేనేత పనివారల సహకార సంఘాల గృహ నిర్మాణాన్ని ప్రోత్సహించటానికి, ఇందుకై ఇంటి ఖర్చులో 66⅔ శతి వరకు అప్పులివ్వటానికి, 33⅓ శతి వరకు విరాళ మివ్వటానికి రూ. 3,600 దాటకుండా కేంద్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ ఏడాది ఈజిల్లాలో రూ. 1.5 లక్షల ఖర్చుతో 50 ఇళ్లు నిర్మింప బడుతవి.

## పారిశ్రామిక సహకార సంఘాలు

ఈ స్కీముయొక్క ముఖ్య ఉద్దేశ్యం—పల్లె పరిశ్రమలు కాలు నిలదొక్కుకొనటం; పని విధానాలను అభివృద్ధి పరచుకొనటం, ఉత్పత్తిని పెంచుకోటం. ఈ విధంగా పల్లె పనివారల నిరుద్యోగాన్ని కూడా ఈ స్కీము చాలవరకు తీరుస్తుంది. 1957-58లో ఈ స్కీముకు రూ. 2.75 లక్షల మొత్తం కేటాయించబడింది. తోలు పరిశ్రమ, చేతి బియ్యం, ఖాదీ, బొమ్మల తయారీ, బట్టల అల్లిక వగైరా ముఖ్య పల్లె

పరిశ్రమలను సహకార విధానాలపై అభివృద్ధి చేయటం ఈ ఏడాది కార్యక్రమంలో ఒక భాగం. ఈ జిల్లాకు కూడా ఇది వర్తిస్తుంది.

## తాటిబెల్లం వగైరాల అభివృద్ధి

నీరా, తాటిబెల్లం వగైరాల మూలంగా జీవనోపాధిని సంపాదించుకొనగలిగేందుకు మాజీ గీతపనివారలకు తోడ్పడటం ఈ స్కీము ఉద్దేశ్యం. బెల్లం తయారీలో నవీన విధానాలు ఈ స్కీముకింద మాజీ గీతపని వారలకు నేర్పబడుతాయి. వ్యాపార పద్ధతులమీద ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలను, నీరా భవనాలను ఏర్పాటు చేయాలని ఉన్నది. 1957-58లో ఈ జిల్లాలో గీతకు 100 లైసెన్సులు ఇవ్వబడుతాయి. 22 టన్నుల తాటిబెల్లం ఉత్పత్తి చేయబడుతుంది. తాటివిత్తులు పంపిణీ చేయబడుతాయి.

# రోడ్లు

## రాష్ట్రరోడ్లు - బకాయి పనులు

విజయనగరం - పాలకొండ రోడ్డు 41/3 మైలువద్ద నాగావళినదికి ఒక దిగువ వంతెన నిర్మాణానికి 1957-58లో రూ. 2.75 లక్షలు కేటాయింపబడినవి.

## రాష్ట్రరోడ్లు - కొత్తపనులు

ఈ ఏడాది ఈ జిల్లాలో కింద పేర్కొన్న రోడ్లకు తారు వేయబడుతుంది. ఇందుకు రూ. 1.30 లక్షలు 1957-58లో కేటాయింపబడినాయి.

| వ. సం. | పనివివరం | 1957-58 కేటాయింపు (రూ. లక్షలు) |
|---|---|---|
| 1. | వి. సి. పి. రోడ్డు 29 ఫర్లాంగులు తారు వేయటం | 0.50 |
| 2. | పార్వతీపురం - పాలకొండ రోడ్డు (% నుంచి 28/5)కు తారు వేయటం - ఇదివరలో తారువేసిన భాగాలుకాకుండా | 0.40 |
| 3. | రాజంచిల కంపలంరోడ్డు 1% నుంచి 17/2వరకు తారువేయటం | 0.40 |

## ప్రభుత్వం స్వాధీనంచేసుకొన్న రోడ్ల నిర్వహణ

ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా లేనందున జిల్లారోడ్లను సరైన స్థితిలో నిర్వహించలేకపోతున్నవి జిల్లాబోర్డులు. అందుకని ప్రభుత్వమే, చాలా జిల్లారోడ్లను స్వాధీనం చేసుకొనటానికి నిశ్చయించింది. 1956-57లో శ్రీకాకుళం - కళింగపట్నం రోడ్డు (% నుంచి 12% వరకు) చిపురుపల్లి లావేరురోడ్డు (% నుంచి 13%వరకు)లను ప్రభుత్వం స్వాధీనపరచుకోవాలని ఉత్తర్వులు జారీచేసింది. ఈ ఏడాది 15 మైళ్ళ 6 ఫర్లాంగుల పొడావున్న సోంపేట - కవిటిమీదుగా - జి. యన్. టి. రోడ్డు స్వాధీనం చేసుకొనబడుతుంది. ఈ రోడ్ల నిర్వహణకుగాను ఈ ఏడాది రూ. 0.80 లక్ష కేటాయించబడింది.

## ఇతర రోడ్లు - బకాయిపనులు

పూర్తికానట్టి పి. డబ్ల్యు. ఆర్. డి. పనులను పూర్తి చేయటానికి ఈ స్కీము కింద శ్రీకాకుళం జిల్లా బోర్డుకు రూ. 1.728 లక్షల మొత్తం గ్రాంటుగా ఇవ్వ బడుతుంది.

## గ్రామ ప్రణాళికల్లో రోడ్లు

కొత్త గ్రామరోడ్లకు, గ్రామాలమధ్య రోడ్లకు వంతెనలు వగైరాలకుగాను జిల్లాలకు బ్లాకు గ్రాంట్లుగా యివ్వటానికై ఈ ఏడాది రు. 12.50 లక్షల మొత్తం కేటాయించబడింది. ఏ పనులను ఆరంభించాలి అనే విషయం. ప్రజలనుంచి వచ్చే తోడ్పాటుమీద, అవసరాలమీద ఆధారపడి వుంటుంది. రు. 12.50 లక్షలమొత్తంలో రూ. 0.9875 లక్ష ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## మిగతారోడ్లు (కొత్తపనులు)

పి డబ్ల్యు. ఆర్. డి. స్కీముకు చెందిన పనుల నిమిత్తం జిల్లా బోర్డులకు ఈ స్కీము కింద గ్రాంట్లు ఇవ్వబడుతాయి. జిల్లాబోర్డులు, గ్రామాలు సమానమొత్తాన్ని సమకూర్చాలి. ఈ స్కీముకై 1957-58లో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఈ జిల్లాకు రూ. 0.11 లక్ష ఈ జిల్లా నంది గాం - పుండిరోడ్డు కంకర చేయటానికిగాను వినియోగింపబడుతుంది.

# విద్య

## ప్రాథమిక విద్య

ప్రాథమిక విద్యాభివృద్ధికిగాను ఆంధ్రప్రాంతానికి 1957–58లో రు. 23.734 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఎలిమెంటరీ పాఠశాలలకు రు. 0.50 లక్ష, జూనియర్ బేసిక్ స్కూళ్ళకు రు. 1.024 లక్షలు. ఇతర ప్రాథమిక పాఠశాలలకు రు. 1.389 లక్షలు పరికరాలను సమకూర్చటానికై వినియోగింప బడుతాయి. మిగతా రు. 20.821 లక్షల్లో రు. 1.811 లక్షల మొత్తం ఈ క్రింది కార్యక్రమాలకై ఈ జిల్లాలో వినియోగింపబడుతుంది.

| కార్యక్రమం. | కేటాయింపు (రు. లక్షలు) |
|---|---|
| 1. 1956-57లో ప్రారంభించిన 13 ప్రాథమిక పాఠశాలలను, అదనపు సిబ్బంది ఈ ఏడాదికూడా నిర్వహించ బడుతవి | 0.130 |
| 2. 1956-57లో ప్రారంభించిన 5 మాధ్యమిక పాఠశాలలు, 25 అదనపు విభాగాలు ఈ ఏడాదికూడా నిర్వహింప బడుతాయి | 0.130 |
| 3. 21 జూనియర్ బేసిక్ పాఠశాలల ఏర్పాటు; అదనపు ఉపాధ్యాయుల నియామకం | 0.632 |
| 4. ఒక ప్రాథమికపాఠశాల ప్రారంభం; అదనపుఉపాధ్యాయుల నియామకం | 0.120 |
| 5. ఒక మాధ్యమికపాఠశాల, 14 అదనపు విభాగాల ప్రారంభం | 0.180 |
| 6. 62 ప్రాథమిక పాఠశాలలను బేసిక్ స్కూళ్లగా మార్చటం; వృత్తి పరికరాల సప్లయి | 0.139 |
| 7. కట్టడాల, ఆటస్థలాల ఏర్పాటు | 0.48 |
| మొత్తం | 1.811 |

## సెకండరీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో సెకండరీ విద్యాభివృద్ధికిగాను 1957–58లో రు. 13.832 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కట్టడాలకు. ఆట స్థలాలకు రు. 0.50

లక్ష, కుర్చీలు, బల్లలు. సామగ్రి వగైరాలకు రు. 2.05 లక్షలు కేటాయించబడినాయి. మిగతా రు. 11.282 లక్షల్లో రు. 0.799 లక్ష ఈ జిల్లాలో కింది విధంగా ఖర్చు పెట్టబడుతుంది.

| కార్యక్రమం | కేటాయింపు (రూ. లక్షలు) |
|---|---|
| 1. 1956-57లో ప్రారంభించిన రెండు హైస్కూళ్లు, 9 అదనపు విభాగాలు ఈ ఏడాది నిర్వహింపబడుతవి | 0.079 |
| 2. ఒక హైస్కూలు, 9 అదనపు విభాగాల ప్రారంభం | 0.080 |
| 3. రెండు హైస్కూళ్ళను హైయర్ సెకండరీ స్కూళ్ళగా మార్చటం | 0.640 |
| మొత్తం | 0.799 |

## సాంకేతిక వృత్తి విద్య

### (యూనివర్సిటీకి సంబంధించనది)

ఆంధ్ర ప్రాంతంలో సాంకేతిక వృత్తి విద్యాభివృద్ధికై 1957–58లో రూ. 7.68 లక్షలు కేటాయించబడినవి. ఇందులో బేసిక్కు కాని ట్రైనింగ్ స్కూళ్లలో ఎలిమెంటరీ గ్రేడ్ శిక్షణ భాగాలను సెకండరీ గ్రేడ్ శిక్షణ భాగాలుగా మార్చటానికి రూ. 0.21 లక్ష, బేసిక్ ట్రైనింగ్ స్కూళ్ళకు కుర్చీలు బల్లలు సామగ్రి వగైరాలను సమకూర్చటానికి రూ.0.30 లక్ష వినియోగింప బడుతాయి. మిగతా రూ. 7.17 లక్షల్లో, రూ. 0.20 లక్షల మొత్తం ఈ జిల్లాలో పార్వతీపురం, కొమరపల్లిలోని బేసిక్ ట్రైనింగ్ స్కూళ్ల ఆటస్థలాలకు ఖర్చుపెట్టబడుతుంది.

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యావ్యాప్తికై ఈ ఏడాది రు. 16.763 లక్షలు కేటాయింపబడినవి. ఇందులో రు, 1.763 లక్షల మొత్తం ప్రీయూనివర్సిటీ కోర్సులను, ఇతర కోర్సులను ప్రారంభించటానికి ప్రభుత్వ కళాశాలలు, ఇతర కళాశాలలకు కుర్చీలు బల్లలు వగైరాలను సమకూర్చటానికి వినియోగింపబడుతుంది. ఇందులో రూ. 3.00 లక్షలు శ్రీకాకుళం ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల కట్టడాల నిమిత్తం ఖర్చు చేయబడుతవి.

## ఉన్నత వృత్తి విద్య, సాంకేతిక విద్య

ఆంధ్రప్రాంతంలో ట్రైనింగ్ కళాశాలలను, ఉన్నతవిద్యా కళాశాలలను అభివృద్ధి చేయటానికి 1957-58లో రు. 19.637 లక్షల మొత్తం వినియోగింప బడుతుంది. ఇందులో రు. 0.160 లక్ష వివిధ జిల్లాల కళాశాలల్లో పౌరసత్వ శిక్షణకై వినియోగింప బడుతుంది.

## సాంఘిక విద్య

ఆంధ్రప్రాంతంలో సాంఘిక విద్యాభివృద్ధికై ఈ ఏడాది రు. 0.80 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష ప్రైవేటు గ్రంథాలయాలకు, ప్రాంతీయ జిల్లా గ్రంథాలయాలకు సహాయ గ్రాంటుగా వినియోగింప బడుతుంది.

## అ పీ - ఇ పీ

వాటికని వీటికని ఈ ఏడాది కేటాయింపబడిన రు. 10.706 లక్షల మొత్తంలో రు. 8.576 లక్షలు కింద స్కీములకుగాను ఆంధ్ర ప్రాంతపు అన్ని జిల్లాల్లోనూ ఖర్చు చేయబడుతాయి.

| స్కీము | కేటాయింపు (రు. లక్షలు) |
|---|---|
| 1. 1956-57లో ప్రారంభించిన యన్.సి.సి. ఏ.సి.సి. దళాల కొనసాగింపు | 4.810 |
| 2. కొత్తగా ఈ దళాలను ఏర్పాటు చేయటం | 0.910 |
| 3. 42 జూనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగాలనూ సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగాలుగా మార్చటం | 0.140 |
| 4. డి. ఇ. ఓ. ల బాలికల పాఠశాలల ఇన్‌స్పెక్టరెస్‌ల ఆఫీసుల్లో అదనపు సిబ్బంది | 0.366 |
| 5. స్కౌటింగ్, గైడింగ్ అభివృద్ధి | 1.800 |
| 6. పునశ్చరణ తరగతులను, గోష్ఠులను ఏర్పాటు చేయటం | 0.220 |
| 7. హిందీ వ్యాప్తి | 0.330 |
| మొత్తం | 8.576 |

# వైద్యం

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఏర్పాటు

గ్రామీణ ప్రజలకు తోడ్పడటానికిగాను జాతీయ విస్తరణ సేవా బ్లాకులలో ఈ స్కీముకింద ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడుతాయి. ఇందుకు కేంద్ర ప్రభుత్వం, యునిసెఫ్ సంస్థ సహాయం చేస్తాయి. మందులు, ఆహారానికి అదనంగా ప్రతి కేంద్రానికి యునిసెఫ్ ఒక జీప్‌కారును సమకూరుస్తుంది. ప్రతి కేంద్రానికి రూ. 30,000ల చొప్పున కట్టడాల నిర్మాణపు ఖర్చును కేంద్రప్రభుత్వం భరిస్తుంది. 1957-58లో 20 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల స్థాపనకు రూ. 9.12 లక్షలు కేటాయింపబడినవి. వీటిలో రెండు కేంద్రాలు ఈ జిల్లా బారువా, మందస బ్లాకులలో ఏర్పాటు చేయబడుతాయి.

## ప్రజారోగ్యం - మలేరియా బ్యూరో విస్తరణ

ఈ స్కీముకింద ఆంధ్ర ప్రాంతంలో 1957-58లో 2 జాతీయ మలేరియా నివారణ యూనిట్లను, 36 సబ్-యూనిట్లను ఏర్పాటు చేయాలని ఉన్నది. వీటిలో రెండు సబ్-యూనిట్లు రూ. 38,000ల ఖర్చుతో ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడుతాయి.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్య విధానాల గురించి తెలియజేసేందుకు ప్రజారోగ్యశాఖ డైరక్టరు ఆఫీసులో ఒక కేంద్ర ఆరోగ్య విద్యా విషయక బ్యూరో ఈ ఏడాది ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకు జిల్లా ఆరోగ్య అధికారులకు 12 జీపులను, 2 వ్యానులను సమకూర్చటానికి రూ. 1,40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఈ జిల్లాకు ఒక జీపు నిమిత్తమై రూ. 5.300లు కేటాయించబడింది.

## బోదకాలు వ్యాధి నివారణ

జాతీయ బోదకాలు వ్యాధి నివారణ స్కీము కింద 1955లో 2 పరిశీలన దళాలు, నివారణ దళం ఏర్పాటు చేయబడినాయి. రెండు పరిశీలన దళాలు 30-9-1956 వరకు పనిచేసినాయి. నివారణ దళం ఇంకా పనిచేస్తోంది. ఈ ఏడాది మరొక నాలుగు నివారణ దళాలను ఏర్పాటు చేయాలని ఉన్నది. వీటిలో ఒకటి రూ. 81,440ల ఖర్చుతో ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడుతుంది.

## బస్తీల్లో నీటి సప్లయి, మురుగుపారుదల స్కీములు

1957-58లో శ్రీకాకుళం నీటిసప్లయి అభివృద్ధి స్కీముకు రూ. 7.59 లక్షలు కేటాయించబడినవి. ఈ స్కీము 1958-59లో పూర్తిచేయబడుతుంది.

# గృహ వసతి

## గ్రామీణ గృహ వసతి

గ్రామ ప్రాంతాల్లో గృహ వసతి పరిస్థితులను అభివృద్ధి చేయటమనేది చాలా బృహత్తరమైన కార్యక్రమం. దీనిని ప్రత్యేకంగా కాక, గ్రామ పునర్నిర్మాణమనే భారీ కార్యక్రమంలో ఒక భాగంగా ఎంచాలి. అందుకే రెండవ ప్రణాళికలో గ్రామీణ గృహ నిర్మాణ కార్యక్రమానికి తగిన ప్రాముఖ్యం చూపబడింది. రూ. 7.13 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతంలో 170 ఇళ్ల నిర్మాణానికి కేటాయించబడింది. ఈ స్కీము కింద నివాస గృహాల నిర్మాణానికిగాను గ్రామీణ గృహ నిర్మాణ సహకార సంఘాలకు దీర్ఘకాలపు ఋణాలు ఇవ్వబడుతాయి. 1956–57లో 25 ఇళ్లు కట్టడానికి ఉపక్రమించటమైనది. ఇందుకు రూ. 0.75 లక్ష అప్పు రూపంలో ఇవ్వబడింది. ఆంధ్ర ప్రాంతపు గ్రామీణ సీమలో 140 గృహాల నిర్మాణానికి రు. 6.00 లక్షల వరకు 1957-58లో దీర్ఘకాలపు అప్పులివ్వాలని ఉద్దేశించబడింది, ఇందులో రు. 80,000ల మొత్తం ఈ జిల్లాలో 16 ఇళ్ల నిర్మాణానికి ఇవ్వబడుతుంది.

## సహకార సంఘాలద్వారా బస్తీల్లో గృహ నిర్మాణం

గ్రామాల్లో పని పాటలు లేక పోవటంవల్ల పల్లెజనం బస్తీలవైపు తిరిగారు. బస్తీల్లో పరిశ్రమలు, వ్యాపార సంస్థలు హెచ్చు అవుతున్నవి. ఇందుమూలంగా బస్తీల్లో జనాభా బాగా పెరిగిపోయింది, ఇళ్ల ఎద్దడి అధికం అయింది. ఈ ఎద్దడిని తగ్గించటానికి ఆంధ్ర ప్రాంతంలో బస్తీల్లో 1,120 ఇళ్లను నిర్మించటానికి రెండవ ప్రణాళిక కింద ఒక స్కీము తయారుచేయబడింది. ఈస్కీము కింద సహకార గృహ నిర్మాణ సంఘాలకు నివాస గృహాల నిమిత్తమై దీర్ఘకాలపు అప్పులు ఇవ్వబడుతాయి, 1957-58 రు. 0.80 లక్ష అప్పుతో 7 ఇళ్లు ఈ జిల్లాలో నిర్మింప బడుతాయి.

## బస్తీల్లో గృహవసతి

స్థానిక సంస్థలు తమ తక్కువ జీతపు ఉద్యోగస్థులకు 155 ఇళ్లను నిర్మించటానికిగాను 1957-58లో ఆంధ్రప్రాంతంలోని స్థానిక సంస్థలకు రూ. 4.35 లక్షలు ఈ స్కీముకింద మంజూరు చేయబడుతాయి. ఇందులో రూ. 28,000ల మొత్తం ఈ జిల్లా బొబ్బిలి మునిసిపాలిటీకి లభిస్తుంది. కేంద్ర ప్రభుత్వం ఈ మొత్తాన్ని ఋణ రూపములో సమకూర్చుతుంది.

# కార్మికుల, కార్మికసంక్షేమం

## జాతీయ ఉద్యోగ సౌకర్య విస్తరణ

ఆంధ్రప్రాంతంలో కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేసిన 11 ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీలను 1-11-1956 నుండి రాష్ట్రప్రభుత్వం నిర్వహిస్తున్నది. ప్రభుత్వ ఆఫీసుల్లో ఇతర ఆఫీసుల్లో ఖాళీలను తెలుసుకొని, తగిన ఉద్యోగార్థులకు ఉద్యోగావకాశాలను సమకూర్చటంలో ఇవి బాగా తోడ్పడుతాయి. నిరుద్యోగ సమస్యా పరిష్కారం విషయమైకూడా బాగా ఉపయోగపడేట్టు వీటిని అభివృద్ధి చేయాలి. ఈ ఉద్దేశ్యంతోనూ, యావత్తు ఆంధ్రప్రాంతానికీ ఈ సౌకర్యం లభించగలిగేందుకుగానూ 1956 అక్టోబరులో శ్రీకాకుళంలో ఒక ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్ ప్రారంభించబడింది. ఈ ఎక్స్ఛేంజ్ ప్రారంభంతో, ఆంధ్రలోని ప్రతిజిల్లాకు విడిగా ఒక ఎక్స్ఛేంజ్ ఉన్నది, 1957-58లో కూడా ఈ జిల్లా ఎక్స్ఛేంజ్ పనిచేస్తుంది. ఇందుకు రూ. 10,000 ఖర్చుఅవుతుంది,

## వెనుకబడిన వర్గాల, షెడ్యూల్డు కులాల సంక్షేమం

### షెడ్యూల్డు కులాలకు స్కాలరు షిప్పులు

ప్రాథమిక, ఉన్నత ప్రాథమిక సెకండరీ పాఠశాలల్లో చదివే షెడ్యూల్డు కులాల విద్యార్థులకు ఈ స్కీముకింద స్కాలరుషిప్పులు ఇవ్వబడుతవి. ఆంధ్రప్రాంతంలో మెట్రిక్యులేషన్ కన్న తక్కువ తరగతులు చదివే పేద హరిజన విద్యార్థులకు అదనంగా 270 స్కాలరు షిప్పులు ఇవ్వబడుతవి. ఇందుకై రూ. 0.40 లక్ష కేటాయించబడింది. ఈ స్కీము ఈ జిల్లాకూ వర్తిస్తుంది.

### షెడ్యూల్డు కులాలకై హాస్టెళ్లు

ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం విరాళపు పద్ధతిన 369 హాస్టెళ్ళు ఉన్నాయి. వీటిలో వుండే హరిజన విద్యార్థులకు ప్రతి సంవత్సరం బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయబడుతాయి. ఈ జిల్లాలో 1957-58లో 134 బోర్డింగు గ్రాంట్లకు రూ. 20,100లు ఖర్చు అవుతుంది.

## షెడ్యూల్డు కులాలకై ప్రభుత్వ హాస్టళ్లు

హరిజనుల సౌకర్యానికై ప్రత్యేక వసతి గృహాలను ప్రభుత్వం నిర్వహిస్తుంది. రెండవ ప్రణాళిక ఆరంభమయ్యే నాటికి ఆంధ్రప్రాంతంలో అట్టివి 23 ఉన్నవి. 1957_58లో విశాఖపట్నంలోని హరిజన బాలుర హాస్టెల్‌లో విద్యార్థుల సంఖ్య పెంచటమేకాక, అనంతపురంలో కళాశాలా విద్యార్థులకు ఒక కొత్త ప్రభుత్వ హాస్టెల్ ఏర్పాటు చేయబడింది. విద్యార్థులెక్కువ ఎక్కువ మంది హాస్టళ్లలోకి చేరుతున్నందున, 1957-58లో ఈ జిల్లాలోని ఇప్పటి ప్రభుత్వ హాస్టెల్‌లో విద్యార్థుల సంఖ్యను పెంచనైనా పెంచాలని, లేదా రూ. 7,000ల ఖర్చుతో ఒక కొత్తం ప్రభుత్వ హాస్టెల్‌ను నిర్మించనైనా నిర్మించాలని ఉద్దేశించబడింది.

## హాస్టెల్, స్కూలు భవనాల నిర్మాణం

ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం అద్దె కట్టడాల్లోనే చాలా సాంఘిక సంక్షేమ పాఠశాలలు, విరాళాలు పొందే హాస్టళ్లు ఏర్పాటు చేయబడినాయి. 1957-58లో ప్రతి జిల్లాలోనూ సాంఘిక సంక్షేమ పాఠశాలకుగాని లేక హాస్టెలుకుగాని ఒక కట్టడం చొప్పున హరిజనులకు ఉద్దేశించబడిన ప్రభుత్వ పాఠశాలలను, ప్రవేటు హాస్టళ్లకు పక్కా కట్టడాలను నిర్మించాలని ఉద్దేశించబడింది. ఇందుకుగాను కేటాయించబడిన రూ. 72,000ల మొత్తంలో రూ. 7,000 ఈ జిల్లాలో ఖర్చు చేయబడుతాయి.

## పారిశుద్ధ్య సౌకర్యాలను సమకూర్చటం

మామూలుగా హరిజనులు నివసించే ప్రాంతాలు అపరిశుభ్రంగా ఉంటవి. హరిజన వాడలు పరిశుభ్రంగా ఆరోగ్యకరంగా ఉండాలంటే, బావులు, బాటలు, స్నానాల గదులు, మరుగు దొడ్లు ఏర్పాటు చేయాలి. 1957_58లో 70 బావుల నిర్మాణానికి రూ. 1.47 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఈ జిల్లాలో 6 బావుల నిర్మాణానికి రూ. 13,000ల మొత్తం ఖర్చు అవుతుంది.

## నివేశన స్థలాల సంపాదన

ఆంధ్ర ప్రాంతంలో మొదటి ప్రణాళిక కింద హరిజనులకు, ఇతర అర్హ కులాల వారికి ఉచితంగా 41,900 నివేశన స్థలాలను ప్రభుత్వం సమకూర్చింది. 1956-57లో హరిజనులకు నివేశన స్థలాల నిమిత్తమై రూ. 6.11 లక్షలు ఖర్చుచేయబడినాయి.

1957-58లో ఈస్కీము క్రై రూ. 3.53లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 32,000లు ఈజిల్లాలో ఖర్చు అవుతాయి.

## ప్రచారం

అస్పృశ్యతా సమస్య నివారణకు ప్రచారం చాలా ఉపయోగపడుతుంది. అస్పృశ్యతకు సంబంధించిన ఉత్తమ నాటకాలకు, బుర్రకథలకు బహుమానాలు ఇవ్వబడుతాయి. పత్రికలకు, ప్రదర్శనలకు విరాళాలు ఇవ్వబడుతాయి. అస్పృశ్యత తీవ్రంగా ఉన్న ప్రాంతాల్లో కరపత్రాలను, పోస్టర్లనువిరివిగా పంచాలని, ప్రదర్శించాలని ఉద్దేశించబడింది. హరిజన దినోత్సవాలు, పంక్తిభోజనాలు, మేళాలు ఏర్పాటు చేయబడుతాయి, ఈ ఏడాది ఈ జిల్లాలో ఈస్కీముకుగాను రూ. 8,600లు ఖర్చు చేయబడుతాయి.

## సంస్థలకు సహాయం

హరిజనసేవక సంఘం, భారత సేవక సమాజం, గిల్డ్ ఆఫ్ సర్వీసెస్. రెడ్ క్రాస్ వగైరా సంస్థలు అస్పృశ్యతా నిర్మూలనకు, హరిజనాభివృద్ధికి పాటుపడుతూ వుంటాయి. 1957-58లో హరిజనసేవక సంఘపు ఆంధ్ర శాఖకు రు. 67,000 లను, ఇతర సంస్థలకు రూ. 33,000 లను మంజూరు చేయాలని ఉద్దేశించబడింది. ఈ సంస్థల ప్రయోజనం ఈ జిల్లాకూ చేకూరుతుంది. ఈజిల్లాలో హరిజన సేవక సంఘం ఇద్దరు ప్రచారకులను నియమించింది.

## హరిజనులకు గృహ వసతి

నివేశన స్థలాలను ఇచ్చినంత మాత్రాన చాలదు. ఎందుకంటె ఇల్లుకట్టుకునే తాహతు ఎక్కడుంది నిరుపేదలైన హరిజనులకు? అందుకని ఈ స్కీము కింద హరిజనులకు, వెనుకబడిన వర్గాల కుటుంబాలకు ప్రభుత్వ నివేశన స్థలాల్లో లేక ఖాళీ గ్రామ స్థలాల్లో గృహ నిర్మాణానికి ఆర్థికంగా సహాయం చేయబడుతుంది. ఒక్కొక్క ఇంటి నిర్మాణ ఖర్చు రూ. 750కు దాటకూడదు. ఇందులో రూ. 250లను ప్రభుత్వం విరాళంగా ఇస్తుంది. వడ్డీలేకుండా రూ. 250లను అప్పుగా ఇస్తుంది. దఫాకు పదేసి రూపాయల చొప్పున 25 సమాన దఫాల్లో అప్పును తీర్చుకోవచ్చు. జిల్లా కలెక్టరు నమోదుచేసే పథకం ప్రకారం ఇంటిని కట్టుకోవాలి. ఈ ప్రయోజనాన్ని పొందే ఆసామి రూ. 250 విలువ వుండే సామగ్రిని, కాయ కష్టాన్ని సమకూర్చాలి. హరిజనులతో కలసిపోయేందుకుగాను వెనుకబడిన వర్గాలవారిని ప్రోత్సాహ పరచేందుకు

ఈ ఇళ్లలో 100కి 10 వారికి ప్రత్యేకించబడుతవి. 1957-58లో ఈ జిల్లాలో కొమరివిల్లి గ్రామంలో 60 ఇళ్ళను నిర్మించటానికి రూ. 30,000ల మొత్తం కేటాయించబడింది.

## వెనుకబడిన వర్గాలకు స్కాలరు షిప్పులు

వెనుకబడిన వర్గాలకు చెంది అర్హత కలిగిన విద్యార్థులకు ఈ స్కీముకింద స్కాలరుషిప్పులు ఇవ్వబడుతాయి. 1957-58లో ఆంధ్ర ప్రాంతంలో హైస్కూళ్ళలో చదివే విద్యార్థులకు అదనంగా 2,500 స్కాలరుషిప్పులను, కళాశాలల్లో చదివేవారికి అదనంగా 300 స్కాలర్‌షిప్పులను సమకూర్చటానికి రూ. 1.25 లక్షలు కేటాయించ బడినవి. ఈ స్కీము ఈ జిల్లాకూ వర్తిస్తుంది.

## వెనుకబడిన వర్గాలకు విరాళపద్ధతిన హాస్టెళ్లు

హైస్కూళ్లలో కళాశాలల్లో చదువుతున్న వెనుకబడిన వర్గాలవారి విద్యార్థులకు ఈ స్కీముకింద విరాళాలివ్వబడిన హాస్టెళ్లలో బోర్డింగ్ గ్రాంట్లు మంజూరు చేయబడ తాయి. ఆంధ్ర ప్రాంతంలో ఇట్టి హాస్టెళ్ళు 19 ఉన్నాయి. ఈ జిల్లాలో 1957-58లో అదనంగా 33 'బోర్డింగు' గ్రాంట్లు ఇవ్వబడుతాయి. ఇందుకయ్యే ఖర్చు రు. 4,950లు.

## వెనుకబడిన వర్గాల పిల్లలకు మధ్యాహ్నపు భోజనవసతి

హరిజన సంక్షేమ పాఠశాలల్లో చదువుతున్న వెనుకబడిన వర్గాలవారి పిల్లలకు ప్రస్తుతం మధ్యాహ్నపు భోజనవసతి ఏర్పాటు చేయబడలేదు. హరిజనులతోపాటు వీరికి సమానమైన వసతులను కల్పించాలని ఉద్దేశించబడింది. ఇందుమూలంగా హరిజన సంక్షేమపాఠశాలల్లో చేరేట్టుగా వెనుకబడిన వర్గాలవారి పిల్లలకు ప్రోత్సాహమిచ్చినట్టూ అవుతుంది, అస్పృశ్యతా నిర్మూలనకూ దోహదమూ కలుగుతుంది. ఆంధ్రప్రాంతంలోని హరిజన సంక్షేమ పాఠశాలల్లోని 1396 వెనుకబడిన వర్గాల విద్యార్థులకు 1957-58లో మధ్యాహ్న భోజనవసతి ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకు రూ. 50,000లు కేటా యించబడినవి. ఈ స్కీము ఈ జిల్లాకూ వర్తిస్తుంది.

## విముక్తజాతుల విద్య

విముక్తజాతులవారి పిల్లలు పాఠశాలలకు హాజరుకారు. తల్లిదండ్రులు వారికి కావలసిన పరికరాలను సమకూర్చలేరు. కాబట్టి ఈ పిల్లలకు పుస్తకాలను పలకలను సమకూర్చాలని ఉద్దేశించబడింది. ఈ ఏడాది ఈ జిల్లాలో ఈ స్కీమును అనులుపరచ డానికి రూ. 400 ల మొత్తం కేటాయించబడింది.

## విముక్తజాతులకు గృహవసతి

రూ. 100 లు విలువగల నిర్మాణ పరికరాలను సమకూర్చి, విముక్త జాతుల వారికి గృహనిర్మాణ విషయంలో తోడ్పడటం ఈ స్కీము ఉద్దేశ్యం; ఉన్న ఇళ్ల మరమ్మతులకు కుటుంబానికి రు. 30 ల చొప్పున గ్రాంటు ఇవ్వాలనికూడా ఉద్దేశించబడింది. ఈ జిల్లాలో విముక్తజాతుల వారికి 30 ఇళ్ళ నిర్మాణానికిగాను ఈ ఏడాది రు. 3,900 ల మొత్తం కేటాయించబడింది. మరొక 30 ఇళ్ళకు మరమ్మతులు చేయబడతాయి.

## విముక్త జాతులకు కుటీరపరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను నిర్వహించుకునేందుకుగాను సహాయపడటం ఈ స్కీముకు ఉద్దేశ్యం. పనిముట్లు, ముడిపదార్థాలు పప్లయి చేయబడుతాయి. ఈ జిల్లాలో 1957-58లో ఇందుకై రు. 1,000 ఖర్చుచేయబడుతుంది.

## విముక్త జాతుల ఆరోగ్యం

విముక్త జాతులు నివసించే ప్రాంతాల్లో బావులు, స్నానాల గదులు, మరుగుదొడ్లు వగైరా పారిశుద్ధ్య కార్యక్రమాలను నిర్వహించాలి ఈ స్కీము కింద ఈజిల్లాలో ఒక బావిని, ఒక స్నానాల గదిని నిర్మించటానికి రూ. 2,500 మొత్తం కేటాయించబడింది.

## విముక్తజాతులకు వైద్యసహాయం

విముక్తజాతులకు చెందిన వ్యాధిగ్రస్తులకు మందు మాకుకు రోగికి రు. 40లు చొప్పున డిస్క్రిషనరీ గ్రాంట్లను ఇవ్వటం ఈ స్కీముకు ఉద్దేశ్యం. ఈ ఏడాది ఈ జిల్లాలో ఇద్దరికి ఈ సహాయం చేయబడుతుంది.

## వ్యవసాయం

విముక్తజాతులు వ్యవసాయవృత్తిని అవలంభించేందుకై కుటుంబానికి రు. 300 ఖరీదుచేసే ఏడ్లజతను సప్లయి చేయాలని ఉద్దేశించబడింది. పంట బావులను నిర్మించటానికి మరమ్మత్తులు చేయటానికి కూడా ఉద్దేశించబడింది.

ఈ జిల్లాలో ఈ ఏడాది ఒక కుటుంబానికి ఈ స్కీము ఉపయోగపడుతుంది.

# షెడ్యూల్డు జాతుల సంక్షేమం

## ఏజెన్సీ ప్రాంతాల్లో కొత్త ప్రాథమిక పాఠశాలల ఏర్పాటు

ఆంధ్ర ప్రాంతపు ఏజెన్సీ ప్రాంతాల్లోని షెడ్యూల్డు జాతుల పిల్లల చదువుకు వసతులు తగినంతగా లేవు. అందుకని ఈ ఏడాది ఆంధ్ర ప్రాంతంలో కొత్తగా 15 ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు చేయబడుతాయి. వీటిలో మూడు పాఠశాలలు ఈ జిల్లా వంగర, గుమ్మడిగూడెము, సంభముల్లో ఏర్పాటు చేయబడుతాయి. ప్రతి పాఠశాలలో ఇద్దరు హైయర్ గ్రేడ్ ఉపాధ్యాయులు, ఒక పనిమనిషి నియమింపబడుతారు. కుర్చీలు, బల్లలు వగైరాల కొనుగోలుకు అదనంగా మూడుపాకలు నిర్మించబడుతాయి. ఒక్కొక్క పాకకు రు. 2,000 ఖర్చు అవుతుంది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో పాఠశాలలకు పక్కా కట్టడాలు

ఆంధ్రప్రాంతంలోని ఏజెన్సీ ప్రాంతపు పాఠశాలలకు ప్రస్తుతం శాశ్వత కట్టడాలు లేవు. అందుకని రెండవ ప్రణాళిక కాలంలో ఈ కట్టడాలను నిర్మించాలి. 1957_58 లో ఈజిల్లాలో పెదగొత్తిలి, జి. శివాడ, నీలకంఠపురం, కె. శివాడలలో నాలుగు ప్రాథమిక పాఠశాలలకు ఇట్టికట్టడాలు నిర్మించబడుతాయి. ఒక్కొక్కదానికి రు. 9,000లు చొప్పున మొత్తం రు. 36,000లు ఖర్చు అవుతుంది.

## పిల్లలకు పుస్తకాలు, పలకలు, దుస్తులు

షెడ్యూల్డు జాతులవారు దారిద్ర్యం, అజ్ఞానం మూలంగా పిల్లలను బడికి పంపరు. వీరికి విద్యలో ఆసక్తి కల్గించటానికిగాను ఎలిమెంటరీ, హైయర్ ఎలిమెంటరీ పాఠశాలల్లోని పిల్లలకు పుస్తకాలను, పలకలను, దుస్తులను సప్లయి చేయాలని ఉద్దేశించబడింది. 1957-58లో ఈ జిల్లా ఏజెన్సీప్రాంతాల్లో కొన్ని నిర్ణీత పాఠశాలలకు రూ. 17,200ల విలువగల పుస్తకాలు, పలకలు, దుస్తులు సప్లయి చేయబడుతాయి. మొత్తం ఈ జిల్లాలో 2,866 మంది పిల్లలకు ఈ సౌకర్యం లభిస్తుంది. ఒక్కొక్కనికి ఒక రూపాయి విలువగల పుస్తకాలు, రూ. 4 లు విలువగల దుస్తులు, ఒక రూపాయి విలువగల పలకలు సప్లయి చేయబడుతాయి.

## నమూనా ప్రదర్శన క్షేత్రాలు

ఏజెన్సీ ప్రాంతాల్లో సాగుకు పనికివచ్చేభూమి విస్తారంగానే వున్నది. కాని ఇచటి అడవిజాతులవారికి సేద్యవిధానాలు తెలియకపోవటం వలన వ్యవసాయం చేయకుండా వుంటున్నారు. అందుకని మేలురకపు సాగువిధానాలగురించి వీరికి శిక్షణనిప్పించటానికి ప్రత్యేక స్కీములు అమలు జరుప బడుతున్నాయి. ప్రభుత్వం నమూనా ప్రదర్శన క్షేత్రాలను ఏర్పాటు చేసేప్పుడు, ఈ శిక్షితులు తామునేర్చుకొన్నది ఆచరణలో పెట్టగలరు. 1957-58లో ఈజిల్లాలో సీతంపేటవద్ద ఒక నమూనాప్రదర్శన క్షేత్రం ఏర్పాటు చేయబడుతుంది. ఈ క్షేత్రంలో మంచిరకం విత్తనాలు, అంట్ల మొక్కలు, పండ్లమొక్కలు పెంచబడి గిరిజనులకు సప్లయిచేయ బడుతాయి. క్షేత్ర నిర్వహణకు ఒక మేనేజర్, ఇద్దరు మేస్త్రీలు, ఒక ఫీల్డ్‌మన్, ఒక బంట్రోతు నియమింప బడుతారు. నీటిసాగుకుగాను ఒక ఆయిల్ ఇంజనుకూడా సప్లయి చేయబడుతుంది.

## సీతంపేట గుమ్మలక్ష్మీపురముల్లో వ్యవసాయ వసతుల విస్తరణ

ఈ స్కీముకింద అడవిజాతుల వ్యవసాయదారులకు మేలురకం విత్తనాలు, ఎరువులు సగం ఖరీదుకు సప్లయి చేయబడుతాయి. ఈ విధంగా ఈ ప్రాంతాల్లో మంచివిత్తనాలను, ఎరువులను వ్యాప్తిలోకి తేవాలని ఉద్దేశ్యం. ప్రతికుటుంబానికి రూ. 750 లను మించకుండా విత్తనాలు, ఎరువులు సప్లయి చేయబడుతాయి. 1957-58 సీతంపేట, గుమ్మలక్ష్మీపురముల్లో సుమారు 27 కుటుంబాలకు సగంధరకు రు.20,000 ఖరీదుచేసే విత్తనాలు, ఎరువులు సప్లయి చేయబడుతాయి.

## సంచార వైద్యదళపు ఏర్పాటు

ఏజెన్సీ ప్రాంతాల్లో ప్రజలకు వ్రాతకోతలు తెలియవు. పశువులపట్ల శ్రద్ధలేదు. పశువులను సరిగా పెంచేందుకు, వీరికి అంటువ్యాధుల నరికట్టేవిషయం గురించి తెలియ జేసేందుకు, ఈ ఏడాది ఈజిల్లా ఏజెన్సీ ప్రాంతాల్లో ఒక సంచారవైద్య దళాన్ని ఏర్పాటు చేయాలని ఉద్దేశించబడింది. ఒక పశువైద్య సహాయక సర్జెన్, ఒక బంట్రోతు ఈ దళంలో పనిచేస్తారు. రు. 500 ల ఖర్చుతో మందులు, పరికరాలు, బల్లలు వగైరా సప్లయి చేయబడుతాయి. జిల్లా ఏజెన్సీ ప్రాంతాల్లో ఈ సర్జన్ సంచారంచేసి, పశువులకు వైద్యసహాయం చేస్తాడు.

## పశువుల పంపిణీ

ఏజెన్సీ ప్రాంతాల్లో పచ్చిక బయళ్లు విస్తారంగా వున్నాయి. ఇందు మూలంగా పశుపోషణకు ఇక్కడ బాగా అవకాశాలు ఉన్నాయి. మొదటి ప్రణాళికా కాలంలో జాతి పశువులను ఏజెన్సీ ప్రాంతాల్లో పంపిణీ చేసేందుకు ఆంధ్ర ప్రాంతంలో ఒక స్కీము అమలు జరుపబడింది. ఈ ప్రాంతాల పశుగణాల అభివృద్ధికిగాను, 1957-58లో ఒక ఆబోతు, ఒక ఆడపశువు, 40 పుంజులు, కోడిపెట్టలు ఈ జిల్లాలో సప్లయి చేయబడుతాయి. ఇందుకు మొత్తం రూ. 2,500లు ఖర్చు అవుతుంది.

## చిన్న పశుచికిత్సాలయాల ఏర్పాటు

జబ్బులు తగలకుండా కాపాడే వసతులు పశుగణాభివృద్ధికి చాలా అవసరం. ఏజెన్సీప్రాంతాల్లో ఇప్పుడున్న పశుచికిత్సాలయాలు ఏ మాత్రమూ సరిపోవు. ఇందుకని 1957-58లో రెండు పశువైద్య చికిత్సాలయాలను, చిన్నవాటిని ఏర్పాటు చేయాలని ఉద్దేశించ బడింది. వీటిలో ఒకటి శ్రీకాకుళం జిల్లాలో ఏర్పాటు చేయబడుతుంది. ఒక వెటెరనరీ అసిస్టెంట్ సర్జన్, ఒక వెటెరనరీ పశుగణాల ఇన్‌స్పెక్టర్, ఒక బంట్రోతు ఈ చికిత్సాలయానికి నియమింపబడుతారు. రూ. 300 లు విలువచేసే మందులు, కుర్చీ, బల్లలు వగైరా సప్లెయి చేయబడుతాయి.

## రోడ్ల ఏర్పాట్లు

ఏజెన్సీ ప్రాంతాలకు, మైదానపు ప్రాంతాలకు మధ్యరోడ్డు లేకపోవటం కూడా ఈ అడవిజాతులు వెనుకబడి వుండటానికి ఒక కారణం. ఈ లోపాన్ని తొలగించేందుకై ఆంధ్ర ప్రాంతంలో 60 మైళ్ల రోడ్లను, వంతెనలు వగైరాలను రెండవ ప్రణాళిక కింద నిర్మించాలని ఉద్దేశించ బడింది. 1957-58లో కొత్తగా 18 మైళ్ల రోడ్లను వేయటానికిగాను రు. 10.67 లక్షల మొత్తం కేటాయించబడింది. వంతెనలూ నిర్మింపబడుతవి. పాతరోడ్లు అభివృద్ధి చేయబడుతాయి. ఈ జిల్లాలో జరిగే కార్యక్రమాలు వివరాలు దిగువన పేర్కొనబడినాయి.

| వ.సం. | కార్యక్రమం. | ఈఏడాది కేటాయింపు | రోడ్డు పొడవు |
|---|---|---|---|
| | | రు. లక్షలు | మై.ఫ. |
| 1. | కురుపం నుంచి ములగేడుదాకా రోడ్డు వేయటం | 0.50 | 1.4 |

## ఏజెన్సీ ప్రాంతాల్లో చిన్న గ్రామరోడ్లు

షెడ్యూల్డు జాతుల శ్రేయస్సుకు, చిన్న గ్రామాల్లో రోడ్లను వేయటం, ఉన్న రోడ్లకు మరమ్మతులు చేయటం ముఖ్యం. ఈ కార్యక్రమాన్ని ఈ జిల్లాలో ఈ ఏడాది నిర్వహించటానికి గాను రూ. 14,000లు వినియోగించ బడుతాయి.

## సీతంపేటలో ఉన్న ప్రభుత్వ డిస్పెన్సరీ వైద్యాధికారుల సంచారం

ఈ స్కీముకింద సీతంపేటలోనున్న ప్రభుత్వ డిస్పెన్సరీ వైద్యాధికారి, ప్రసూతి సహాయకురాలు కనీసం పదిహేనురోజుల కొకసారి గోవిద, సమరగోవిద, హడ్డుబంగి, జకరవలస, మండ, ఉప్పరజమ్మి, బీరపాడు, మొగదరగూడ ఏజెన్సీ గ్రామాలకువెళ్లి, గ్రామస్థులకు వైద్యసహాయం చేస్తారు. ఇందుకుగాను 1957-58లో రు. 2,000ల మొత్తం కేటాయించ బడింది.

## తోనంవద్ద డిస్పెన్సరీ ప్రారంభం

ఈజిల్లా ఏజెన్సీ ప్రాంతాల ప్రజలకు వైద్యవసతులను సమకూర్చటానికి, 1957-58లో రూ. 14,000ల ఖర్చుతో తోనంవద్ద ఒక డిస్పెన్సరీ ఏర్పాటు చేయబడుతుంది. దీనికి ఒక వైద్యాధికారి, ఒక కాంపౌండరు నియమింపబడుతారు.

## ప్రసూతి శిశు ఆరోగ్య కేంద్రాలు

పసిపిల్లల చావుల నరికట్టేందుకు, ఈజిల్లా భద్రగిరి (ఎల్విన్‌పేట) వద్ద ఒక ప్రసూతి శిశు ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని ఉద్దేశించబడింది. మంత్రసాని సామాను, కుర్చీ, బల్లలు వగైరాలతోపాటు కేంద్రానికి ఒక జీప్ కూడ సప్లయి చేయ బడుతుంది. ఒక ఆరోగ్య సంచారకుడు, నలుగురు ప్రసూతి సహాయకురాండ్రు, ఒక డ్రైవర్, నలుగురు ఆయాలు నియమింపబడుతారు. కేంద్రానికి రూ. 1.555ల ఖర్చుతో ఒక మాదిరి కట్టడం నిర్మించబడుతుంది.

## ఆహారపుష్టి లోపంవల్ల కలిగే జబ్బుల నివారణ

ఈజాతులవారు బాధపడే జబ్బులకు ముఖ్యకారణం వారి ఆహారంలో తగినంత పుష్టిలేకపోవటమే. ఇట్టిజబ్బుల నరికట్టేందుకై 1957-58లో రు. 2,500లు విలువచేసే

పాలు, మందులు, విటమిను ఉపాహారాలను ఈజిల్లా భద్రగిరి వద్ద ఏర్పాటు కానున్న ప్రసూతి శిశు సంక్షేమ కేంద్రంద్వారా సప్లయి చేయాలని ఉన్నది.

## మలేరియా నిరోధక కార్యక్రమాలు

ఈ జాతులవారు బాధపడే జబ్బుల్లో ముఖ్యమైనది మలేరియా. మలేరియా నివారణకు కొన్ని స్కీములు అమలు జరుపబడుతున్నవి. 1957-58లో రు. 63,800ల ఖర్చుతో ఈజిల్లా ఏజెన్సీ ప్రాంతాల్లో కింది కార్యక్రమాలు అమలు జరుపబడుతాయి.

1. మలేరియా నిరోధక కార్యక్రమం, పార్వతీపురం, పాతపట్నం.
2. ఏజెన్సీ ప్రాంతాల్లో మలేరియా నిరోధక కార్యక్రమాల విస్తరణ.

## ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియోసెట్లు

విషయ సమాచారాలను విస్తారంగా వ్యాప్తి చేయటానికి రేడియో బాగాఉపయోగ పడుతుంది. ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియో సెట్లద్వారా ప్రభుత్వం ఏజెన్సీ ప్రజల అభివృద్ధికి చేస్తున్న వివిధ కార్యక్రమాల గురించి వారికి బాగా తెలియజేయ వచ్చును. 1957-58లో ఆంధ్ర ప్రాంతపు ఏజెన్సీప్రాంతాల్లో 27 రేడియో సెట్లు ఏర్పాటు చేయబడుతాయి. వీటిలో 6 సెట్లు ఈ జిల్లా ఏజెన్సీప్రాంతాల్లో నిర్ణీత గ్రామాల్లో ఏర్పాటు చేయబడుతాయి.

## మంచినీటి బావులు

సరైన మంచినీటి వసతులు లేక పోవటం మూలంగా, ఏజెన్సీప్రజలు వాగుల్లోని, మురుగు గుంటల్లోని నీరు తాగుతూవుంటారు. ఆ విధంగా వారి ఆరోగ్యం దెబ్బతింటుంది. అందుకని 1957-58లో ఆంధ్ర ప్రాంతపు ఏజెన్సీ ప్రాంతాల్లో రూ. 1.24 లక్షల ఖర్చుతో 30 మంచినీటి బావులను నిర్మించాలని వుద్దేశించ బడింది. వీటిలో 12 బావులు ఈ జిల్లాలో నిర్మించ బడుతాయి. ఖర్చు రు. 51,000 లు.

## స్త్రీ సంక్షేమ శాఖలు

షెడ్యూల్డు జాతులస్త్రీలు ప్రసూతి, శిశుసంక్షేమం విషయాలగురించి శ్రద్ధ ఏమీ తీసుకోరు. వారికి ఈ విషయాలనుగురించి సరైన శిక్షణఇవ్వటానికిగాను మొదటి

ప్రణాళిక కాలంలో ఆరు స్త్రీ సంక్షేమ కేంద్రాలు ప్రారంభించబడినాయి. 1957_58లో మరొక మూడు కేంద్రాలు ఏర్పాటు చేయబడుతాయి. వీటిలో ఒకటి **ఈ జిల్లాలో** ఏర్పాటు చేయబడుతుంది. ఒక స్త్రీ సంక్షేమ నిర్వాహకురాలు, ఒక ప్రసూతి సహాయిక, ఒక బంట్రోతు నియమింపబడుతారు. రు. 500ల మందులు సప్లయి చేయబడుతాయి. పరికరాలు వగైరాలకు రు. 5,200లు ఖర్చు అవుతుంది.

## రోగులకు, అవిటివారికి సహాయం

కాయకష్టం చేయలేని ఈ **జాతి** స్త్రీలకు సహాయార్థంగా ఈ ఏడాది రు. 0.10 లక్ష కేటాయింపబడింది. ఇది 50 మంది ఆడవారికి ఉపయోగపడుతుంది. ఈ జిల్లాలోని 12 మందికి ఈ సౌకర్యం లభిస్తుంది.

# స్త్రీ సంక్షేమం

స్త్రీ సంక్షేమ శాఖల కృషిని అభివృద్ధి చేయటానికిగాను, ఈ శాఖలకు పరికరాలు దృక్ శ్రవణ యంత్రాలు, తోట పనిముట్లు సప్లయి చేయబడుతాయి. ఆంధ్ర ప్రాంతానికి 1957-58లో ఇందుకై రు. 0.27 లక్ష కేటాయించబడింది.

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు

1957 ఏప్రిల్ వరకు ఈ జిల్లాలోని రెండు సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు ఏర్పాటు చేయబడినాయి. ఇవి ఈ ఏడాది కూడా నిర్వహింపబడుతాయి.

## సాంఘిక నైతిక పునరుద్ధరణ

సాంఘిక వ్యవస్థలోని లోపాల మూలంగా కొన్ని సాంఘిక దురాచారాలు తలెత్తుతున్నవి. ఈ లోపాలను సరిదిద్దటం దురాచారాల నిర్మూలనకు అవసరం. ఈ సమస్యలను కేంద్రసాంఘిక సంక్షేమసంస్థ క్షుణ్ణంగా పరిశీలించింది. రాష్ట్రాల్లో సేవా సదనాలను, విశ్రాంతి గృహాలను ఏర్పాటుచేయాలని ఉద్దేశించబడింది ఆంధ్ర ప్రదేశ్‌లో రెండవ ప్రణాళిక కాలంలో 20 జిల్లా కేంద్రాలు ఏర్పాటుచేయబడుతాయి. వీటిలో ఒకటి ఈ జిల్లాలో బొబ్బిలిలో బాలికల నిమిత్తమై ఏర్పాటు చేయబడుతుంది. శ్రద్ధ తీసుకోవలసిన అవసరమున్న వారికి గాను జిల్లా కేంద్రాలు ఏర్పాటు చేయబడుతుంది. రాష్ట్రహోమ్సుకు వారిని అప్పగించేదాకా తాత్కాలికంగా వారికి ఈ కేంద్రాలలో వసతి చూపబడుతుంది. ప్రతి జిల్లా కేంద్రంలో 25 మంది ఉంటారు.

# రేడియో ప్రసారం

## కమ్యూనిటి రేడియో సెట్ల ఏర్పాటు, నిర్వహణ

రెండవ ప్రణాళిక కాలంలో ఆంధ్రప్రాంతంలో 5,000 కమ్యూనిటీ రేడియో సెట్లను ఏర్పాటుచేయాలని ఉద్దేశించ బడింది. 1956-57లో 500 సెట్లు ఏర్పాటుచేయ బడినవి. ఒక్కొక్క సెట్టు ఖరీదు రు. 300లు ఇందులో రు. 125 లను కేంద్రం భరిస్తుంది. మిగతా ఖర్చును స్థానికసంస్థలు పెట్టుకుంటవి. ఏడాదికి సెట్టుకు రు. 120ల నిర్వహణ ఖర్చులను కూడా ఇవే భరించాలి. మిగతా రు. 100 సెట్టుకు ఏడాదికి రాష్ట్రప్రభుత్వం భరిస్తుంది. ఆంధ్రప్రాంతంలో ఈ ఏడాది 1,000 కమ్యూనిటీ రేడియో సెట్లను ఏర్పాటు చేయాలని ఉన్నది. వీటిలో 75 సెట్లు శ్రీకాకుళం జిల్లాలో ఏర్పాటుచేయబడుతాయి.

# ప్రచారం

1956-57లో నియమింపబడిన పబ్లిసిటీ అసిస్టెంట్లు ఈ ఏడాదికూడా పని చేస్తారు. ఇదికాక జిల్లా ప్రధాన నగరంలో సమాచార కేంద్రం ఈఏడాది ఏర్పాటు చేయబడుతుంది.

# బ్యూరో ఆఫ్ ఎకనామిక్సు, స్టాటిస్టిక్సు

## జిల్లా స్టాటిస్టికల్ సంస్థ

1953లో జరిగిన రాష్ట్ర వ్యవసాయ, సహకార మంత్రుల సమావేశం జిల్లా స్థాయిలో వ్యవసాయానికి సంబంధించిన లెక్కలను సరిగా తనిఖీచేయటానికి, త్వరగా తయారు చేయటానికి జిల్లా స్టాటిస్టికల్ ఆఫీసర్లను నియమించవలసిందని సిఫారసు చేసింది. ఈసిఫారసును 1954లో జరిగిన భూమిలెక్కల డైరక్టర్ల, వ్యవసాయ గణిత నిపుణుల సమావేశం పునరుద్ఘాటించింది. కేంద్ర ప్రభుత్వం నియమించిన వ్యవసాయ ధరల విచారణ సంఘంకూడా దీనిని బలపరచింది. 1955లో జరిగిన కేంద్రరాష్ట్ర గణితశాస్త్ర నిపుణుల సంయుక్త సమావేశంకూడా దీనినే సిఫారసు చేసింది. ఈ సిఫారసులన్నిటి ఫలితంగా రెండవ ప్రణాళికా కాలంలో ప్రతి జిల్లాలో ఒక స్టాటిస్టికల్ ఏజెన్సీని ఏర్పాటుచేయటానికి ఒక స్కీము తలపెట్టబడింది. ప్రతి జిల్లా ఏజెన్సీకి ఒక జిల్లాస్టాటికల్ ఆఫీసర్, ఒక ఇన్వెస్టిగేటర్, ఒక పైతరగతి గుమాస్తా, ఒక బంట్రోతు ఉంటారు. ఈ స్కీమును అంచెలవారీగా అమలు జరుపాలని ఉన్నది. 1957-58లో రాష్ట్రంలో మూడు జిల్లా ఏజెన్సీలు ఏర్పాటుచేయబడుతవి. వీటిలో ఒకటి రూ. 4,150ల ఖర్చుతో ఈ జిల్లాలో ఒక ఏజెన్సీ యేర్పాటు చేయబడుతుంది.

జిల్లా స్టాటిస్టికల్ ఏజెన్సీ నిర్వర్తించవలసిన విధులు :—

1. జిల్లా స్థాయిలో ప్రభుత్వపు వివిధ శాఖల అంకెలను సమీకరించటం; అంకెలన్నిటి విషయంలో సమన్వయ సంస్థగా పనిచేయటం.
2. వివిధ జిల్లా ఆఫీసులు సకాలంలో సమాచారాన్ని అందించేట్టు, సరైన ప్రమాణాలను అనుసరించేట్టు చూడటం.
3. సమాచార సేకరణ గురించి ప్రత్యక్షంగా అక్కడికక్కడ విచారణలను జరపటం.
4. సమాచారాన్ని ప్రాథమిక స్థాయిలో సేకరించే వారికి మధ్య మధ్య శిక్షణ నివ్వటం.

5. ప్రస్తుతం లభించకుండా వున్నట్టి, లభించినా అత్యల్పంగా ఉంటున్నట్టి ఆర్థిక సమాచారాన్ని. అంకెల ఛోగట్టాను సేకరించటం. ఇదివరలో ఏ ఆధారమూ లేకుండా ఉన్న సందర్భంలో.

6. అధికార అనధికార సంస్థలు తెలియజేసే టోకు ధరలకు, గ్రామీణ ధరలకు వినియోగదార్ల ధరలకు సూచీసంఖ్యలను నిర్దేశించే విషయమై ధరల సమాచారాన్ని ఎప్పటి కప్పుడు తనిఖీ చేయటం.

7. బ్యూరో ఆఫ్ ఎకనామిక్స్ స్టాటిస్టిక్సు జిల్లాల్లో నిర్వహించే సాంఘిక ఆర్థిక పరిశీలనల సందర్భంలో సహాయపడటం. అజమాయిషీ చేయటం.

8. సమాజాభివృద్ధి. జాతీయ విస్తరణ బ్లాకుల్లో అంకెలకు సంబంధించిన విషయాలను గురించి సాంకేతిక పర్యవేక్షణ జరపటం.

## తంతితపాలా ఆఫీసులు

1957-58లో విశాఖపట్నం శ్రీకాకుళం జిల్లాల్లో 46 (విడిగా జిల్లా వివరములు తెలియవు)తపాలా ఆఫీసులు ఏర్పాటు చేయబడుతాయి. శ్రీకాకుళం జిల్లాలో 3 టెలిఫోను ఎక్స్చేంజీలు నౌపడ, సోంపేట, గరివిడివద్ద ప్రారంభించబడుతాయి.

# రైలు మార్గాలు

1957-58లో ఈ జిల్లాలో కింద పేర్కొన్న రైలు మార్గాలకు సంబంధించిన పనులు జరుపబడుతాయి :—

పని జరుగుతున్నట్టివి :

1. మందస రోడ్డు, పలాస మధ్య క్రాసింగ్‌స్టేషన్ ఏర్పాటు
2. సిగడం, చీపురుపల్లి మధ్య ,,
3. సోంపేటవద్ద మూడవ ప్రవేశపు మార్గం
4. సీతానగరంవద్ద ,,
5. డొంకినవలస, గజపతినగరం మధ్య క్రాసింగ్‌స్టేషన్ ఏర్పాటు
6. గూమాడవద్ద మూడవ ప్రవేశపు మార్గం
7. కోట బొమ్మలివద్ద పెద్దమార్గాన్ని విడిచేయటం, పాయింట్ల విషయంలో కొత్త ఏర్పాట్లు
8. బి.యన్. రైలుమార్గం - గోపాలపట్నం - సోంపేట సెక్షనులోని వివిధ స్టేషన్లలో 50 పాత టోకెన్ పనిముట్ల స్థానే కొత్తవాటిని ఏర్పాటు చేయటం.
9. కోరుకొండ, గోపాలపట్నం మధ్య 27 మైళ్లు కొత్తగా మళ్ళీ వేయటం
10. పలాస, వాత్తేరుల మధ్య 1354 సంఖ్యగల వంతెనకు కొత్త 'గర్డర్'ను వేయటం
11. నౌపడవద్ద రెండవతరగతి డిస్పెన్సరీ
12. నౌపడ ఆసుపత్రి సిబ్బందికి ఒక యూనిట్ రకం, మూడు ఇళ్లు.
13. ,, ,, ,, రెండు ఇళ్లు
14. పలాసవద్ద 8 యూనిట్ టైప్ ఒక ఇల్లు
15. శ్రీకాకుళం రోడ్డు మంచినీటి సప్లయి
16. పలాసవద్ద పిల్లల పార్కు
17. ఇచ్చాపురంవద్ద ఒక యూనిట్ రకం, ఒక ఇల్లు
18. తిలారువద్ద విద్యుచ్ఛక్తి సప్లయి విస్తరణ
19. డొంకినవలస, కోమటిపల్లి మధ్య రాతి మరమ్మతులు
20. బొబ్బిలివద్ద సామాన్ల ప్లాట్‌ఫారం విస్తరణ వగైరాలు
21. నౌపడవద్ద కొత్త గుడ్సుషెడ్

22. కోటబోమలివద్ద కొత్త గుడ్సు పార్సెల్‌గిడ్డంగి
23. గరివిడివద్ద సిగ్నలింగ్, ఇంటర్‌లాకింగ్ పనులు
24. నౌపడవద్ద నీటివసతి ఏర్పాటు
25. తిలిలగార - గజపతినగరం సెక్షన్‌లో టోకెన్ పనిముట్లను సమకూర్చటం
26. గరివిడివద్ద వంతెనను కొత్తగా వేయటం
27. సాలూరువద్ద చుట్టూ ప్రహరీతో గుడ్స్ షెడ్
28. సిగడం డిటో
29. సోంపేట డిటో
30. నౌపడవద్ద 2 యూనిట్‌పైపు 1 క్వార్టర్సు
31. పెదసాన, తెంబూరుమధ్య రక్షణ పనులు
32. నౌపడవద్ద గార్డు బాక్స్‌రూమ్
33. పలాస డిటో
34. పలాసవద్ద శిఖరదీపాలు
35. పలాసవద్ద ఆవరణలో విద్యుచ్ఛక్తి దీపాలు
36. బొబ్బిలికి విద్యుచ్ఛక్తి
37. పార్వతీ పురానికి విద్యుచ్ఛక్తి
38. చీపురుపల్లి స్టేషన్ కట్టడానికి మార్పులు పేర్పులు
39. చీపురుపల్లి ప్రయాణీకుల ప్లాట్‌ఫారానికి కప్పు ఉన్న షెడ్
40. నౌపడవద్ద బి.జి, యన్.జి. ప్లాట్‌ఫారంపై నీటి టవర్, చేరికరోడ్డుకు తారు వేయటం
41. బొబ్బిలివద్ద వెయిటింగ్‌హాల్, ఆవరణగోడ విస్తరణ, మంచినీటి పంపు.
42. పార్వతీపురంవద్ద వెయిటింగ్ హాలుకు విస్తరణ
43. గజపతి నగరం ,, ,, ,,
44. గోరింటవద్ద వెయిటింగ్‌హాల్
45. కోటబోమలివద్ద ప్లాట్‌ఫారం షెడ్
46. నౌపడవద్ద ప్లాట్‌ఫారం కప్పు
47. పాతపట్నంవద్ద (ఇద్దరికి) మరుగుదొడ్డి
48. పదసానవద్ద వెయిటింగ్‌హాలు
49. మందూరువద్ద ప్లాటుఫారంకప్పు, మంచినీటి షెల్టర్

50. రౌతుపురంవద్ద వెయిటింగ్‌హాలు
51. తిలారుస్టేషనుకు విద్యుచ్ఛక్తి
52. సోంపేట ,, ,,

## కొత్తపనులు

53. పలాసవద్ద అదనంగా ఒక ప్రవేశమార్గం
54. పలాస, పుండిమధ్య క్రాసింగ్ స్టేషన్
55. కోటబొమ్మలి, తిలారుమధ్య క్రాసింగ్‌స్టేషన్
56. నౌపడవద్ద మూడవ ప్రవేశమార్గం
57. సిగడంవద్ద ,,
58. గరివిడివద్ద ,,
59. శ్రీకాకుళంరోడ్డు ,,
60. సిగడం, గరివిడిమధ్య తొమ్మిదిమైళ్ళదూరం కొత్త పట్టాలు
61. పలాసవద్ద డిస్పెన్సరీ ప్రహరీగోడతో సెప్టిక్ టాంక్ మరుగుదొడ్డి
62. పార్వతీపురం స్టేషన్‌కు విద్యుచ్ఛక్తి
63. శ్రీకాకుళం రోడ్డువద్ద మంచినీళ్ల చలవయంత్రం
64. బొబ్బిలివద్ద ,, ,,
65. పలాస వద్దమంచి నీటిసప్లయి

# జిల్లా ప్రణాళిక అభివృద్ధి సంఘ సభ్యుల జాబితా

| | |
|---|---|
| కలెక్టరు : | అధ్యక్షుడు |
| అనధికారి : | ఉపాధ్యక్షుడు |
| ఎక్స్అఫీషియో సెక్రటరీ : | జిల్లా ప్లానింగ్ ఆఫీసరు |

## స భ్యు లు

1. ఎక్జిక్యూటివ్ ఇంజినీర్, పి. డబ్ల్యు. డి. శ్రీకాకుళం
2. జిల్లా వ్యవసాయశాఖాధికారి, శ్రీకాకుళం.
3. సహకారసంఘాల డిప్యూటీ రిజిష్ట్రారు, శ్రీకాకుళం.
4. జిల్లా వైద్యశాఖాధికారి, విశాఖపట్నం.
5. జిల్లా పశువైద్యశాఖాధికారి, శ్రీకాకుళం.
6. జిల్లా హెల్తాఫీసరు, శ్రీకాకుళం.
7. డివిజనల్ ఇంజినీర్లు, (హెచ్. డబ్ల్యు.) శ్రీకాకుళం.
8. డివిజనల్ ఇంజినీర్, విద్యుచ్ఛక్తి, శ్రీకాకుళం.
9. జిల్లా విద్యాధికారి, శ్రీకాకుళం.
10. జిల్లా పంచాయితీ ఆఫీసరు, శ్రీకాకుళం.
11. పరిశ్రమలు, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, విశాఖపట్టణం.
12. జిల్లా వెల్ఫేర్ అఫీసరు, శ్రీకాకుళం.
13. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, విజయనగరం.
14. జిల్లా అటవీశాఖాధికారి, విజయనగరం.
15. నేషనల్ సేవింగ్స్‌స్కీమ్, జిల్లా ఆర్గనైజరు, శ్రీకాకుళం.
16. స్పెషల్ డిప్యూటీ రిజిష్ట్రారు సహకార సంఘాలు (పంచదార ఫ్యాక్టరీ కోసం) ఆముదాల వలస.
17. శ్రీ బి. రాజగోపాలరావు, యం. పి. ఆముదాలవలస.
18. శ్రీ బి. సత్యనారాయణ, యం. పి.

19. శ్రీ డిప్పల సూరిదొర యం. పి.
20. శ్రీ పి. యస్. నారాయణ, ఎం. ఎల్. ఏ, శ్రీకాకుళం.
21. శ్రీ సి. హెచ్. సత్యనారాయణ, ఎం. ఎల్. ఏ. షేర్‌మహమ్మదపురం.
22. శ్రీ టి. పాపారావు, ఎం. ఎల్. ఏ. నగరి కటకం.
23. శ్రీ యం. సత్యనారాయణ రాజు, ఎం. ఎల్. ఎ. చీపురుపల్లి
24. శ్రీ కె. పున్నయ్య. ఎం. ఎల్. ఏ. చీపురుపల్లి (రిజర్వుడు)
25. శ్రీ పి. ఏన్. అప్పారావు. ఎం. ఎల్. ఏ. పాలకొండ
26. శ్రీ పి. హెచ్. శ్రీరంగనాయకులు, ఎం. ఎల్. ఏ. వణుకూరు
27. శ్రీ అడ్డాకుల లక్ష్మినాయుడు, ఎం, ఎల్. ఏ. నాగూరు
28. శ్రీ వి. చంద్రచూడామణిదేవ్. ఎం. ఎల్. ఏ. పార్వతీపురం
29. శ్రీ కె. సీతారామస్వామి, ఎం. ఎల్. ఏ. బొబ్బిలి
30. శ్రీ పెద్దింటి రామస్వామినాయుడు, ఎం, ఎల్. ఏ. బాలాజీపేట
31. శ్రీ బోయిన రాజయ్య, ఎం. ఎల్. ఏ. సాలూరు (రిజర్వుడు)
32. శ్రీ అల్లూరు ఎరుకునాయుడు, ఎం. ఎల్. ఏ. సాలూరు
33. శ్రీ యస్. జగన్నాధం, ఎం. ఎల్. ఏ. నరసన్నపేట
34. శ్రీ ఎల్. లక్ష్మణదాస్, ఎం. ఎల్. ఏ, పాతపట్నం.
35. శ్రీ పి. గున్నయ్య, ఎం.ఎల్.ఏ. పాతపట్నం, (రిజర్వుడు)
36. శ్రీ ఆర్, ఎల్. నరసింహం. ఎం.ఎల్.ఏ, టెక్కలి.
37. శ్రీ నెచ్చెర్లరాములు, ఎం.ఎల్.ఏ. బ్రాహ్మణతర్ల.
38. శ్రీ జి. లచ్చన్న, ఎం.ఎల్.ఏ, సోంపేట.
39. శ్రీ ఉప్పాడ రంగబాబు ఎం. ఎల్. ఏ. ఇచ్ఛాపురం.
40. జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు శ్రీకాకుళం.
41. మ్యునిసిపల్ కౌన్సిల్, అధ్యక్షుడు, శ్రీకాకుళం.
42. మ్యునిసిపల్ కౌన్సిల్, అధ్యక్షుడు, సాలూరు.
43. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు. టెక్కలి.
44. సబ్‌కలెక్టర్, పార్వతీపురం.
45. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, గార.
46. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, ఆముదాల వలస.
47. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, బారువ.

48. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, ఇచ్ఛాపురం.
49. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, బూర్జ.
50. శ్రీ సుగ్గు శ్రీనివాసరెడ్డి, కళింగపట్నం.
51. శ్రీ మొహమ్మద్ సబురుద్దీన్ సాహెబ్, గ్రామ పంచాయతీ అధ్యక్షుడు, ఇచ్ఛాపురం.
52. శ్రీ కొత్తపల్లి నరసయ్య, బారువ.
53. శ్రీ కొర్ల హరికృష్ణ చౌదరి, బ్రాహ్మణతర్ల, టెక్కలి తాలూకా.
54. శ్రీ త్రిపురాణ రాఘవదాస్, సిద్ధాంతం, శ్రీకాకుళం తాలూకా.
55. మిసెస్. టి. వి. సత్యనారాయణరావు, జిల్లా ప్రాజెక్టు ఇంప్లిమెంటింగ్ కమిటీ కన్వీనరు, శ్రీకాకుళం.
56. శ్రీ వై. కుప్పేశ్వరరావు, పాలకొండ.
57. శ్రీ జి. ఎల్. నాయుడు, తామరపల్లి, టెక్కలి తాలూకా.
58. శ్రీ రొక్కం రామమూర్తి, గ్రామపంచాయతీ అధ్యక్షుడు, కిమిడి.
59. శ్రీ చీకటి పరుశురామ నాయుడు, పార్వతీపురం.
60. శ్రీ యం. చంద్రశేఖరరావు, చలవానిపేట, నరసన్నపేట తాలూకా.
61. శ్రీ వి. జగన్నాధం, కాదుము, పాతపట్నం తాలూకా.
62. శ్రీ బెండికూర్మన్న, సీతాపురం, టెక్కలి తాలూకా.
63. శ్రీ జి. రాజారావు, గుత్తవిల్లి, పాలకొండ తాలూకా.
64. శ్రీ మచ్చాస్వామి నాయుడు, బాడంగి, బొబ్బిలి తాలూకా.
65. శ్రీ టి. యస్. గుప్త, నరసన్నపేట.
66. శ్రీ బి. యం. రెడ్డి, నౌపడ, టెక్కలి తాలూకా.
67. అసిస్టెంటు వుమన్ వెల్‌ఫేర్ ఆఫీసరు, విశాఖపట్టణం.
68. ఎక్జిక్యూటివ్ ఇంజనీర్, స్పెషల్ డివిజను, విజయనగరం.
69. మత్స్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, విశాఖపట్టణం.
70. అసిస్టెంటు రేడియో ఇంజనీర్, కాకినాడ.
71. అసిస్టెంటు ఇంజనీర్, ఎల్. డి. డబ్ల్యు. శ్రీకాకుళం.
72. బ్లాక్ డెవలెప్‌మెంట్ ఆఫీసరు, షేక్‌మహమ్మదుపురం దగ్గర బూడుమూరు.
73. బ్లాక్‌డెవలెప్‌మెంట్ ఆఫీసరు, మందస.
74. శ్రీ గంటి భోగయ్య, బారువ.
75. శ్రీ చల్లా నృసింహం నాయుడు, అడ్వకేటు, శ్రీకాకుళం.